

# కొత్త సుప

## నీలి డిటర్జెంట్ బార్



మురికితో మీ నిరంతర పోరాటం ముగిసినట్లే.
న్యూ సుప డిటర్జెంట్ బార్ సబ్బు నురుగులో
తెల్లదనం బూడిదరంగు మురికని వదిలించి
మీ బట్టలకు తెల్లదనాన్ని ప్రకాశాన్ని తిరిగి
ప్రసాదిస్తుంది. తెల్ల బట్టలు మరింత తెల్లగాను,
రంగుబట్టలు మరింత ఆకర్షణీయంగాను,
కనిపిస్తాయి. అన్నిరకాల దుస్తులకు ఇది
అత్యుత్తమం. మరే ఇతర డిటర్జెంట్ బార్ కన్న
న్యూ సుప డిటర్జెంట్ బార్ చాలా పొదుపైనది.




**మీ బట్టలకు తెల్లని**
**తెటప్పును కాంతిని**
**తిరిగి తెస్తుంది**

HARYANA DETERGENTS LTD



maa HDL 16-79 Tel

లోకంపోకడ — జోమెన్

జనతా ఆశలు

ఇందిరా ఆశలు

జనతా (ఎస్) ఆశలు

పొదిగే కాలం!

రాష్ట్రపతి నిరభిశంసించాలన్న విషయాన్ని మర్చిపోండి! మీరు ప్రజలకిచ్చిన హామీలు నెరవేర్చనందుకు ప్రజలు రేపు జరిగే ఎన్నికల్లో మిమ్మల్ని అభిశంసించబోతున్నారు!

రాజకీయాల్లో శాశ్వత శత్రుత్వం వుండదు! శాశ్వత ప్రయోజనాలు వుంటాయి! మా ప్రయోజనాల దృష్ట్యా మేము ఇందిరకు అనుకూలంగా మారవచ్చు!

ఆర్ ఎస్ ఎస్

సరిగా చూడండి! అది పావురం!


**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938 – 1972]

శుక్రవారం : 21-9-'79

సిద్ధార్థినామ సం. భాద్రపద బ. అమావాస్య

సంపుటము 73 : సంచిక 4

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60

ఆరు మాసాల చందా రు. 20-80

విడి ప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :

నటి రూప

(ఫోటో : [illegible])

**కథలు :**



**సీరియల్ కథలు :**



**వ్యాసాలు, శీర్షికలు :**

# ఉత్తరాలు

## ముఖచిత్రం

31.8.79 వినాయకుని ముఖచిత్రంగా వెలువడిన (ఆంధ్రపత్రిక వీక్లీ) నవరసాలతో నిండివుంది. ఈ సంచిక చదువుతుంటే, మా కథుపుచెక్కలయ్యేటట్టు నవ్వుకున్నాము. . . .

—ప్రపుల్ల, నారాయణమ్మ, యోగీశ్వరయ్య, గంగిరెడ్డి, సుబ్బమ్మ (బొమ్మిరెడ్డిపల్లి).

* * *

24.8.79వ తేదీ ముఖచిత్రం లేపటిపౌరులు చాలా బాగుంది. బాలల సంవత్సరంలో ప్రచురించటం ఎంతో ముచ్చటగా ఉంది. వళిని సీరియల్ పత్రికకే హైలెట్. రష్యాలో బాలలకు ఎన్నో ప్రత్యేక సదుపాయాలు. శీర్షిక వలన సోవియట్ యూనియన్‌లో పిల్లల పెంపకంలో ఎంత శ్రద్ధ తీసుకుంటారో చక్కగా తెలియచేశారు.

విజయ, సీత (కావలి).

## కథలు

31.8.79 వారి ఆంధ్రసచిత్రవారపత్రిక చాలా బాగుంది. గణపతిదేవునిపై జోకులు బాగున్నాయి. కుక్కదెబ్బ, కాలప్రభావం, దిగంబర రహస్యం కథలు బాగున్నాయి. రాగరేఖలు సీరియల్ ముగింపు బాగుండలేదు.

నాగంటిశంకరశాస్త్రి, (యనమదుర్రు.)

## సీరియల్

31.8.79వ తేది ఆంధ్రసచిత్రవారపత్రిక నాట్యగణపతి ముఖచిత్రం చూచి, గణపతి నిజంగా మా ఇంటికి వచ్చేడా? అన్నట్లు అనుభూతి కలిగినది. రాగరేఖలు సీరియల్ చివరివరకు రసవంతంగా ఉంది. రచయిత మేము అనుకొన్నట్లే సీరియల్ ముగించేరు. వారికి, ప్రచురించిన మీకు నా అభివందనములు. ఈ పత్రిక జన్మదిన సందర్భముగా నా శుభాకాంక్షలు అందజేస్తున్నాను. ఈవారం కార్టూన్లు కడుపుబ్బ నవ్వించేయి.

వేమూరి వెంకటేశ్వరశర్మ, (సింధియా.)

* * *

31.8.79న తేదీన వెలువడిన ఈవారం పత్రిక రియల్లీ సూపర్బ్. వినాయకునిపై జోక్ చేసి ప్రచురించిన శీర్షికలన్నీ కడుపుబ్బనవ్వించాయి. పదే పదే చదివించాయి. కథలు మూడూ ముచ్చట గొలిపాయి.

ప్రేమపాశం— కొత్త సీరియల్ ఆదిలోనే ఆకర్షించింది. సినీజీగారి బైస్కోప్ బాతాఖానీ సరదాగా ఉంది.

పెన్మెత్స నూరిబాబు, బాను, ప్రసాద్, శ్రీకృష్ణ (హైదరాబాదు.)

## బైస్కోపు బాతాఖానీ

నాట్యగణపతి చిత్రం చాలా బాగుంది. ప్రత్యేక సంచిక పై ముద్దుగా! క్రొత్తవారికి అవకాశం ఇచ్చినందుకు అభినందనలు. చిత్రకార్ల కథల్లో దిగంబరరహస్యం ఛలేబాగుంటే నిన్నటివారి కుక్కదెబ్బ మరీబాగుంది. మరిహ బైస్కోపు బాతాఖానీ చదివాక ఎంత తెలుగుబైస్కోపుల పరిస్థితి ఏమిటి అనేది సినీపండిట్స్ హాస్యలో వివరిస్తే అనుకుందాం. చివరిపేజీలో కార్టూన్ బావుంది. ఫూమన్ పొలిటికల్ కార్టూన్స్ బావుంటున్నాయి.

విమప్రమ్ తిరునగరి, దేవకి, పద్మ [ శ ం ]



రాజమండ్రిలో పుష్కరస్నానాలకు వచ్చిన వయోవృద్ధులను, వికలాంగులను రేవులో నుంచి పైకి తీసుకువస్తున్న సత్యసాయి సేవా సమితి వలంటీర్లు.

రాజమండ్రి పాతరైల్వే వంతెన ప్రక్కన పున్న పుష్కరాల రేవులో స్నానాలు చేస్తున్న యాత్రికులు.



# రిస్క్

పంతుల జోగారావు



వాడి ఖర్మ, మరి. అనుభవిస్తాడు వెధవ.

అంత రిస్క్ తీసుకో వొద్దని ముందే చెప్పాను. చెపితే విన్నాడు కాదు.

చెవిలో యిల్లు కట్టుకుని పోరినట్టు చెప్పాను.

చిలక్కి చెప్పినట్టు చెప్పాను. చిన్న పిల్లాడికి చెప్పినట్టు చెప్పాను. విన్నాడా? ఉహూఁ! మంకు వెధవ— వాడి ధోరణి వాడిదే—వివరిస్తి చెప్పినా పట్టించుకోడు. వాడి బుర్రకేది తోస్తే అది చేస్తాడు. తలచుకున్న పని పూర్తయే వరకూ వాడికి నిద్రపట్టదు కూడా!

'ఒరే బ్రహ్మం—ఇంతవరకూ నువ్వి వెర్రి మొర్రి వేషాలు వేసినా చెల్లిపోయింది. కాని యిప్పుడు నువ్వు చెయ్యబోయే పని చాలా రిస్క్‌తో కూడింది. ప్రాణాపాయం జరిగినా జరగొచ్చు! నువ్వేమన్నా సర్కసువాడివా, వీధి విద్యలు చేసేవాడివా— అలాంటి ఫీట్లు ప్రదర్శించడానికి? నా మాట విని బుద్ధిగా యింట్లో కూచో! నీకిక్కడయినా నాలుగైదు ట్యూషన్లు చూసి పెడతాను— ప్రైవేట్లు చెప్పి పదో పాతికో సంపాదించుకో— నీ ఖర్చు గట్టెక్కిపోతుంది. అంతే కాని యిలాంటి సాహస కార్యాల్లోకి తలదూర్చకు' అంటూ నాలుగూ దులిపేశాను.

అంతా విన్నాడు. విని, 'నువ్వూ, నీబోడి సలహాలూ చాల్లే!' అని అసహ్యించుకున్నట్టుగా ముఖం పెట్టాడు. వాడి మౌనంతో నా మాటలు వాడి తలలోకి ఎక్కాయనే అనుకున్నాను. తన నిర్ణయాన్ని మార్చుకుంటాడనే భావించాను.

నా ఉపన్యాసమంతా బుగ్గిలో కలిపేసేదనీ, నా మాటలకి అరపైసా విలువ లేదనీ త్వరలోనే తెలిసిపోయింది. నేను చెయ్యగలిగిందేమీ లేక వాడి ఖర్మానికి వాడినొదిలేశాను.

* * *

బ్రహ్మంగాడి తీరే మొదటినుంచీ అంత. వాణ్ని చిన్నప్పటి నుంచీ ఎరుగుదును. సాహసం చెయ్యడం అంటే వాడికి సరదా. మా చిన్నప్పుడు తోటల వెంటా దొడ్ల వెంటా మమ్మల్ని లాక్కుపోయి తెగ తిప్పేవాడు. సీమచింత బొట్లు యేరుకోడానికి చెట్లెక్కేవాడు. ఆ ముళ్ళు గీరేసి, ఒళ్ళు రక్కుకుపోయి, బట్టలు చిరిగిపోతున్నా లక్ష్యపెట్టేవాడు కాదు. నేర్పుగా వాడలా

చెట్టు కొనకొమ్మమీదికి విగ బ్రాకుతూ వుంటే ఆశ్చర్యంతో చూస్తూ వుండేవాళ్ళం. ఓసారి కాలు జారి పడ్డాడు. చెయ్యి విరిగింది. ఫ్రాక్చరయ్యింది. కట్టు వూడదీసేక మళ్ళీ మామూలే!

శివర్రాత్రికి బళ్ళమీద గుంపు యాత్రకి వెళ్ళేటప్పుడు వాడి సంబరం చూడాలి! బండి నాయుడ్ని బతిమాలి, బానగాలి, వాళ్ళ నాన్న జేబులోనుంచి ఎత్తుకొచ్చిన బీడీకట్ట యిచ్చి- వాడిచేతిలోనుంచి కొరడా తీసుకునేవాడు. కొరడా ఝుళిపిస్తూ ఆ గతుకుల రోడ్డుమీద ఎద్దుల్ని పరిగెత్తించే వాడు. గూడబండీ అటూ యిటూ వూగి పోతూంటే ఎద్దులు గబగబ పరిగెట్టడం మాకు సరదాగానే వుండేది కాని భయంతో గుండె గుబగుబలాడేది.

రైలయినా, బస్సయినా కూడా అంతే- కదిలేవరకూ ఎక్కకపోవడం వాడికి గొప్ప! చెరువులో మునిగితే కొద్దిగా కొన్ని క్షణాల వరకూ కనిపించకుండా మమ్మల్ని అదరగొట్టేసేవాడు- టెన్త్ పరీక్షలు రాసేక వాళ్ళ అన్నయ్య సైకిలు మీద ఒక్కడూ విజయనగరం వెళ్ళి సినిమా చూసివొచ్చేడు! రానుపోను ముప్ఫైమైళ్ళ దూరం- అందులోకీ వచ్చేటప్పుడు కటిక చీకటి! వాడి ధైర్యానికి మెచ్చుకోకుండా వుండలేకపోయాం.

'అందర్లాగా మామూలుగా బతికేస్తే లైఫ్‌లో థ్రిల్ వుండదర్రా - వెరైటీ వుండాలి. మనల్నిచూసి అంతా ముక్కున వేలేసుకోవాలి. అదేమజా!' అంటూ వుండే వాడు.

వాడి ప్రభావం నామీద కాని, మా స్నేహితుల మీద కాని పని చెయ్యలేదు.

వాడు మాత్రం లైఫ్‌లో థ్రిల్‌కోసం అహర్నిశలు పాకులాడుతున్నట్టు వుండేవాడు.

పెరిగి, జీవితాల్లో స్థిరపడ్డాక స్వంత వూర్లో నేనూ వాడూ మాత్రమే మిగిలేం. నాకు కొంచెం పొలం వ్యవహారాలూ, మేష్టరు గిరీ వుంది.

వాడు మాత్రం ఒంటరి వాడై పోయాడు. తల్లి చిన్నప్పుడే పోయింది. ఇంటర్‌లో చేరాక తండ్రి పోయాడు. చదువాగిపోయింది. ఒంటరివాడై పోయా వన్న బెంగా దిగులు వాడిలో ఏ కోశానా కనిపించేది కాదు.

తండ్రి పోయేక వున్న అరెకరం పొలాన్ని అమ్మేసి టౌన్లో ఏదో వ్యాపారం పెట్టాడు. రెండేళ్ళల్లో అది కాస్తా హరించుకు పోయింది. తిరిగి వూళ్ళోకొచ్చి పడ్డాడు.

అయినా వాడి ముఖంలో దిగులు కను పించేది కాదు. నవ్వుతూ తిరిగేవాడు కాదు. వాడి తలలో ఏదో పెద్ద పథకమే మెదులుతున్నట్టుగా తరుచుగా వాడి మాటల బట్టి గ్రహించేను.

అది కాస్త వాడి నోటి నుంచే విందా మని ఆగేను. ఓరోజు తనంతట తానుగా చెప్పనే చెప్పాడు.

ఆ రోజు స్కూలు నుంచి యింటికి వొచ్చి కాఫీ తాగుతూ వుంటే, రాకెట్‌లా దూసుకొచ్చేడు.

'బదరూ! నీతో చాలా మాట్లాడాలి, అలా యేటి దిబ్బల వరకూ వెళ్దాం, వస్తావా?' అని పిలిచేడు. వాడికీ కాఫీ యిచ్చి, కాఫీలు పూర్తయేక బయలుదేరాను వాడివెంట.

అక్కడ తన పథకం గురించి తెలియ జేసాడు-

'హైదరాబాద్ టెలివిషన్‌లో- స్టంట్‌లు ఒంటిమీద, నీళ్ళమీద జల్లుకుని- అంటించుకుని మంటలతో ఓ మనిషి మహాసాహసంగా యిగాత కొలనులో గెంతడం గురించి విన్నావుకదూ?' అడిగేడు.

తలూపేను, విన్నానన్నట్టుగా.

'మనూరికీ హైదరాబాద్‌కీ ఎంత దూరం?'

చచ్చు ప్రశ్న! కిలోమీటర్లలో దూరం చెప్పేను.

'అంచేత యిక్కడి వాళ్ళకి అలాంటి సాహసకార్యం చూడగలిగే భాగ్యం లేదం టాను- నువ్వేమంటావు?'

'కావచ్చును.'

'అందువల్ల, ఆ వింత మన గ్రామం లోనే ఏర్పాటుచేసి, అందరికీ ఆనందం కలిగించాలనుకుంటున్నాను.'

కళ్ళు పెద వివేసి వాడివేపు ఆశ్చర్యంగా చూసేను.

వాడే కంటిన్యూ చేసాడు: 'అలా క్వొశ్చను మార్కు ముఖం పెట్టకు- చెప్పింది విను; చాలా రిస్కుతో కూడిన

## జర్మనిలో “రాగియుగం”

రాగి పాత్రలను మన పూర్వీకులు ఉప యోగించేవారు. వాటితో మంచినీరు త్రాగితే ఆరోగ్యం అని నమ్మేవారు. ఇది అక్షరాలా నిజం అని ఆధునిక శాస్త్రంద్వారా ఇప్పుడు రుజువయింది. రాగి లోహం యొక్క మహిమ ఏమంటే రాగి క్రిమి సంహారిణి అని తేలింది. అందుచేతనే ఇపుడు జపానులో అన్నిటిని రాగితో చేస్తున్నారు. రాగితో కాని, రాగిని మిశ్రమం చేసి కాని వాష్ బేసిన్‌లు తయారుచేస్తున్నారు. అంతే గాక మేజోళ్ళు, జోళ్ళకు రాగి ఇన్‌సోల్స్ కూడా తయారు చేయబోతున్నవి. రాగి పాదరక్షలు పాదాలకు వింతో శిక్షణ కలి పిస్తున్నవట. క్రిములను సంహరించి పాదా లను సర్వవిధాలా రక్షించగలవు. పాత్రలను తుడుచుటకు కూడా రాగితో తయారు కాబడిన డిష్ టావల్స్‌ను మార్కెట్టులో ప్రవేశ పెట్టారు. పెద్ద భవనాలలో హేండ్ రైల్స్‌ను అమర్చటంలో కిటుకు ఏమంటే వాటిని ఉపయోగించి మేడమెట్లు ఎక్కితే చేతికి క్రిముల వలన హాని ఏమీ జరగదు. అలాగే తలుపులకు బిగించి డోర్‌నాబ్స్ కూడా ఇదే కారణంవలనే రాగి లోహంతో తయారు చేసేవారు శతాబ్దాల తరబడి. కాపర్ ఇయాన్- కాపర్ రసాయనికాలతో తేమతో కలిసినపుడు క్రిమి సంహారిణిగా ఉపయోగ పడుతుంది. అందుచేతనే మంచినీటి రిజ ర్వాయరులతో సహితం కాపర్ సల్ఫేటును వుపయోగిస్తున్నారు టోకియోలోని ఏరూక వాసాంగ్యకైషా లిమిటెడ్ కంపెనీ వారు రాగి మిశ్రమం లేని పాలిథిన్ ఫిల్మును వెనుక రాగి లోహాన్ని పూసి వస్తువులను తయారు చేస్తున్నారు. ఇప్పుడు మనం తెలుసుకొనదగు గొప్ప విశేషమేమంటే కాళ్ళ నుడతల జబ్బు వున్నవారు యిగా రాగి ఇన్‌సోల్స్ తగిలించి చేసిన పాదరక్షలను వుపయోగిస్తే ఆ జబ్బు నయమవుతుంది. అంతేగాక కాళ్ళలో రక్త ప్రవాహం మరింత జోరు అవుతుంది. ఆవడం మూలాన కాళ్ళకు ఉషారు కలిగించి విశ్రాంతను మటుమాయం చేస్తుంది

# రిస్క్

వ్యవహారం యిది. అందుకే చెపుతున్నాను! మన గ్రామంలోనే కాక చుట్టుపక్కల మన పంచాయితీల్లోగల పన్నెండు పల్లెలు నుంచీ ప్రజలు విరగబడి వస్తారు—మనసంతకోనేరు గట్టుమీద క్రేనుతో ఎత్తయివస్తే జీకట్టించి దానిమీంచి కోనేరులో దూకే కార్యక్రమం జరుగుతుంది. ఆ అద్భుతం చూసి, ఈ ప్రాంతాల పల్లె ప్రజలంతా నోళ్ళు వెళ్ళబెట్టి వలసిందే! ఇంటికో పదిరూపాయల టిక్కెట్లు చొప్పున అమ్ముతాం— ఈ ఫీట్ అయ్యేక రికార్డ్ డాన్స్ కూడా పెట్టిద్దాం. అమ్మవారి జాతరలో అంతా చేరుతారు కనుక ఆరోజే దీనికి ముహూర్తం — ఈ విషయంలో నీ సహాయం కొంత కావాలి!' అన్నాడు ధాటీగా.

పెద్ద స్కీమే!

'ఇంతకీ ఆ ఫీట్ చేసేదెవరు?' అడిగేను.

'ఇంకెవరు-నేనే!'

నోరు వెళ్ళబెట్టేశాను.

వీడు తీసుకోబోతూన్న మొట్టమొదటి అత్యంత ప్రమాదకరమయిన రిస్కు..చిట్ట చివరిదీ కూడా బహుశా యిదే కావొచ్చు!

ఇడియట్—వీడికిదేం పోయేకాలం?

నచ్చచెప్పడానికి ప్రయత్నించాను.

సహజంగానే వాడు వినిపించుకోలేదు!

'నువ్వొట్టి ఫూల్‌విరా బ్రదరూ! జీవితం ఓ పెద్ద గేమ్! ఒప్పగా సాఫీగా గడచిపోతే బ్రతుక్కి అర్థమే లేదు — అప్పుడప్పుడు మిరకిల్స్ జరుగుతూ వుండాలి. అందులోనూ యీ పల్లెటూరు మనుషులు నిద్రతో జోగుతూ పడుకున్నట్టుండరూ! ఎప్పుడో విన్నికలొస్తే తప్ప వీళ్ళలో చైతన్యమనేదే కనిపించదు— అందుకని డామ్మని బాంబు పేల్చినట్టుగా యిలాంటి దేదో జరగాలంతే- రిస్క్ చేస్తూ విజయాల వైపు పయనిస్తేనే జీవితం అర్థవంత మవుతుంది...'

'నువ్వు పిల్లా పీచూ లేనివాడివి, ఏన్ని మాటలయినా మాట్లాడతావు' అన్నాను నిష్ఠూరంగా.

వాడు నవ్వి, 'అందుకేన్నేమీ, ఏడ్వెంచర్ చెయ్యమంటా! నీ జీవితంలో పిల్లల్ని కనడం తప్పించి వేరే ఏడ్వెంచర్ చేసినట్టు తోచదు. ఇంతకూ నేను చెప్పబోయేది విను—' అన్నాడు.

వాడు నన్ను దెబ్బతీసేడు. వాడుచెప్పేది వినదల్చుకోలేదు. 'నీకూ నీ సిద్ధాంతాలకి ఓ నమస్కారం! నీ సాహసాలో నువ్వుపడు — నన్నందులోకి లాగొద్దు' అనేసి అక్కడ్నుంచి లేచిపోయేను.

వాడు జాలిగా 'ప్చ్' అని నిట్టూర్చేడు.

* * *

ఆ తరువాత బ్రహ్మం తన ప్రయత్నాలని మాత్రం మానలేదు. అట్టహాసంగా, తను చేస్తే అమ్మవారి పండుగనాడు చెయ్యబోయే సాహసం గురించి ప్రచారం ఉధృతంగా సాధ్యమయినంత గొప్పగా సాగించేడు.

ఊరూ వాడా తిరిగి మరీ ఆ ప్రోగ్రాంకి టిక్కెట్లు అమ్మేడు—జనం గొప్ప ఉత్సాహంతో టిక్కెట్లు కొని అమ్మవారి జాతరరోజు ఎప్పుడొస్తుందా అని ఆతృతతో ఎదురు చూడ సాగేరు. చాలా టిక్కెట్లు అమ్మేడు బ్రహ్మం. లెక్కలు తెలీవు కానీ, వేల సంఖ్యలో డబ్బు పోగుచేసినట్టుగా వినికిడి— నా మొహాన ఓ కాంప్లిమెంటరీ పాసు పారేసేడు! చెప్పొద్దూ, నేనూ ఆ రోజు కోసం బెంగ బెంగగా ఎదురు చూడసాగేను.

ఆ రోజు కాస్త రానే వొచ్చింది.

సంతకోనేరు దగ్గర యేర్పాట్లు బ్రహ్మాండంగా జరిగేయి.

అమ్మవారి సంబరాలకి చుట్టు పక్కల నుంచి జనం వెల్లువలా వచ్చేరు. అంతా కోలాహలంగా వుంది! అందరూ ఉత్సాహంగా బ్రహ్మం చెయ్యబోయే వింత ప్రదర్శనకోసం కబుర్లు చెప్పుకుంటూ ఎగబడుతున్నారు.

ఇంతలో- కార్చిచ్చు లాంటి ఓ వార్త వ్యాపించి, అలజడి మొదలయింది!

బ్రహ్మం పరారయ్యేడుట!

డబ్బుతో పాటూ ఉడాయించేడుట!

అంతా పొలోమంటూ బ్రహ్మం యింటి మీద పడ్డారు. యింటికి తాళం వేసి వుంది. పెద్ద రభస మొదలయింది. జనం కోపానికి అవధుల్లేకుండా పోయింది.

# పలుకుబడి ప్రభావం

## ధర్మపథం

పలుకుబడికున్నశక్తి, అసామాన్యమైనది దానికున్న శక్తి ధనానికి లేదు. పలుకుబడి ఉన్న దరిద్రుడైనా ప్రభువులను కూడా ఎన్నికలలో ఓడించడం మనం చూస్తూనే ఉన్నాము.

పలుకుబడిఉన్నట్లయితే నందిని పందినీ, పందిని నందినీ చెయ్యవచ్చును. అవతలి వాడు ఎంతో ఉత్తముడు కావచ్చు. ఎవ్వరి లోను, ఎట్టి పేచీలు పెట్టుకోకుండా సరియైన మార్గంలో తన జీవితాన్ని కొనసాగిస్తూ ఉండవచ్చును. ప్రజల ఆదరాన్ని పొందుతూ ఉండవచ్చు. అయినా, పలుకుబడి ఉన్నవాడు తలచుకుంటే - ఇతనిని అధఃపాతాళానికి అణచి వెయ్యగలడు.

ఆ పనిని సాధించవలెననే పట్టుదల ఉన్నప్పుడు, దానిని సాధించడానికి పలుకుబడిని మించిన సాధనంలేదు. 'అట్టిస్థితిలో న్యాయాన్యాయాలను గురించిన ఆలోచన, యుక్తాయుక్త వివేకం ఉండవు. అవతలి వాని యోగ్యతకు మచ్చ కలిగించే ఏ ప్రచారాన్ని చెయ్యడాని కయినా మనస్సు సమ్మతిస్తుంది. అసత్యాలు సత్యాలుగా మారిపోతాయి. దీనికి మొదట తనవారితో గుసగుసలు ప్రారంభిస్తే చాలును. వాళ్ళు వారికి తెలిసినవారికి యీ సమాచారాన్ని అందచేస్తారు. అది త్వరగానే అంతటా అల్లుకుపోతుంది. పని సులభంగా జరిగిపోతుంది.

ఇలాగే ఒకరిని పైకి లేవనెత్తాలన్నా పలుకుబడి బాగా పని చేస్తుంది. అయోగ్యుడు, అనర్హుడు అయినాసరే — ఉన్నత స్థితికి వస్తాడు.

అయితే-యీ రెండు పద్ధతులలోనూ ఉపయోగించే పలుకుబడి వల్ల తాత్కాలికమైన ప్రయోజనం కలిగినా — అసలు విషయం బయటపడకపోదు. అప్పుడు పలుకుబడికి గట్టిదెబ్బ తగులుతుంది. ఒకసారి పోగొట్టుకున్న పలుకుబడిని తిరిగి సంపాదించడం కష్టం.

పలుకుబడి కలవారు తమ శక్తిని సద్వినియోగం చేసుకొనవలసి ఉంటుంది. ఉత్తములకు దానివల్ల మేలు కలగడంతో పాటు తమ కీర్తి, గౌరవాలున్నూ పెంపొందుతాయి.

అభ్యున్నతిమార్గంలో ఉపయోగించడమే పలుకుబడికి సరైన ప్రయోజనం.

— బులుసు వేంకట రమణయ్య

---

బ్రహ్మం కనిపిస్తే వున్నపాటున సరికి పోగులు పెట్టడమో, సజీవ దహనం చేసెయ్యడమో చేస్తారు- తథ్యం!

ఈ స్థితిలో వాడు కనిపించక పోవడమే ఉత్తమం అనిపించింది నాకు.

వాడు చేసిన పని నాకూ ఆశ్చర్యమే కలిగించినా, ఆ క్షణంలో వాడి క్షేమంకోసం భగవంతుడ్ని ప్రార్థించిన మాట మాత్రం వాస్తవం.

* * *

అమ్మవారి జాతర వెళ్ళిపోయేక కూడా బ్రహ్మంమీద జనానికి కోపం చల్లారలేదు. ఎప్పుడు కనిపిస్తాడాఅని ఎదురుచూస్తున్నారు. దొరికితే వాడి అంతు చూస్తారు, తప్పదు. డబ్బు కక్కుర్తితో యీ రిస్కు తీసుకున్నాడని తెలుస్తూనే వుంది. రామ్మూర్తి నాయుడు కూడా యీ విషయంలో పట్టుదలగా వున్నాడని తెలుస్తోంది రామ్మూర్తి నాయుడంటే మా వూళ్ళోనూ చుట్టు ప్రక్కల గ్రామాల్లోనూ అందరూ జడిసి ఛస్తారు... పగ పట్టేడంటే పాములా కాటేస్తాడతను... అతను చేసే మోసాలకూ పాపాలకీ అంతూ పొంతూ లేదు. ఒకటో రెండో ఖూనీలు చేయించినట్టుగా కూడా చెప్పుకుంటారు... అతను స్వయంగా యీ వ్యవహారంలో కలుగ జేసుకుని బ్రహ్మం సంగతి తను తేలుస్తానని జనానికి భరోసా యిచ్చి వాళ్ళని శాంత పరిచేడు. ఇంక బ్రహ్మాన్ని బ్రహ్మదేవుడు కూడా కాపాడలేడన్నది యదార్థం!

'వాడి ఖర్మ, మరి. అనుభవిస్తాడు వెధవ! అంత రిస్కు తీసుకోవద్దని ముందే చెప్పాను. చెపితే విన్నాడు కాదు—' అనుకున్నాను.

* * *

పని మీద విశాఖపట్నం వెళ్ళేను.

ఓ హోటల్లో కాఫీ తాగుతూవుంటే హఠాత్తుగా బ్రహ్మం కనిపించేడు. ఆశ్చర్యంతో తలమునకలయ్యేను! మనిషి చాలా మారిపోయేడు. ఇప్పుడింకా స్టయిల్‌గా దర్జాగా వున్నాడు.

నోరు మెదిపి ఏదో అనబోయేను.

నన్ను మాట్లాడవద్దని వారించేడు. హోటలు బిల్లు వాడే చెల్లించి తనతోపాటు తీసుకెళ్ళాడు

ఇద్దరం బీచ్ కెళ్ళాం.

'ఇప్పుడు తిట్లు ప్రారంభించు' అన్నాడు.

నాకు ఒళ్ళు మండిపోయింది. 'ఛ! నువ్వింత మోసగాడి వనుకో లేదురా బ్రహ్మం! మొత్తం అందర్నీ బుట్టలో వేసి డబ్బు పట్టుకుని ఉడాయిస్తావా?! అక్కడంతా ఎంత గొడవగా వుందో తెలుసా! కనిపిస్తే నిన్ను బ్రతకనిచ్చేలా కనిపించటంలేదు— అదీకాక యీ విషయంలో రామ్మూర్తి నాయుడు కూడా కలుగజేసుకున్నాడు. నాయుడు ఎంత డేంజరస్ ఫెలోనో తెలుసు కదా! అతని వాత పడ్డావంటే నీ పని సరి! నీ అంతు చూస్తానని నాయుడు స్వయంగా భరోసా యిచ్చాకనే వాళ్ళంతా నీ మీద పోలీస్ రిపోర్టు యివ్వడం మానుకున్నారు—' అన్నాను బాధగా.

వాడు పెద్ద పెట్టున నవ్వేడు.

'ఎందుకా నవ్వు?' కసిరేను అసహనంగా —తన్నాలనుంది వాడి నవ్వు వింటూంటే.

'ఈ వ్యవహారంలో నాయుడు కలుగజేసుకున్నాడూ ?! అయితే రిస్కే లేదు!' అన్నాడు మళ్ళీ నవ్వుతూ.

'అంటే...?' అన్నాను సంశయంగా.

'అంటేనా, ఈ ఫీట్‌లో హీరో నేను— సైడు హీరో నాయుడే గనక!'

కొయ్యబారి పోయాను.

'ఒరే మొద్దూ! లైఫ్‌లో చకచకా నెగ్గుకు రావాలంటే రిస్కు చెయ్యాలిరా బ్రదర్- మరీ బొత్తిగా చవటలా కూచుంటే బ్రతుకు గొంగళి పురుగు వాటమే అవుతుంది...' అంటూ తన ఉపన్యాసం మొదలు పెట్టాడు.

నా చెవులు వాడి మాటలు వినలేక పోయాయి!



## తేలు మందు!

చావవస్తున్నప్పుడు ఓ శుద్ధమైన గాజు పాత్రలో నేరుగా యీ వాననీటిని పట్టి, ఆనక ఆ నీటిలో కరిగినంత ఉప్పు కలిపి, [మెత్తని ఉప్పు] ఆ ద్రవాన్ని తేలుమందుగా వాడచ్చని ఓ విజ్ఞాని కనిపెట్టాడట. తేలు కుడిభాగంలో కుడితే ఎడమ కంటిలో యీ నీరు ఒకటి రెండు బొట్లు వేస్తే చాలని, ఎడమభాగంలో కుడితే కుడికంటిలో యీ నీటి చుక్కలు వేయాలనీ, అలా వేస్తే నిముషంలోపల చేత్తో తీసినట్టు బాధపోతుందనీ కూడా ఆ విజ్ఞాని విజ్ఞప్తి చేశారట.

## తగిన శాస్తి!

చిదంబరం నుంచి తిరువారూరుకు పోయే ఓ బస్సు కండక్టరు కొంతమంది ప్రయాణీకులకు టిక్కెట్టు ఇవ్వకుండా డబ్బులు జేబులో వేసుకున్నాడట. ఈ సందర్భంగా వాళ్ళు పోట్లాడితే కండక్టరూ, డ్రైవరూ చేరి ఆ ప్రయాణీకులతో పోట్లాడారట. తమ ఊళ్ళొ దిగిపోయిన ఆ ప్రయాణీకులు ఆ బస్సు తిరిగి వచ్చే సమయంలో ఆ బస్సును ఆపి, కండక్టరునూ, డ్రైవరునూ క్రిందికి లాగి చితకబాదారట. ఈ బాదుడు కాస్త ఎక్కువైనందువల్ల ఆ డ్రైవర్నీ, కండక్టర్నీ ఆసుపత్రిలో జేర్చాల్సి వచ్చిందట.



## రాజకీయ హత్యలు ?!

ఆంధ్రప్రదేశ్ మిర్యాలగూడకు చెందిన అంజెపల్లిలో ఇందిరా కాంగ్రెసుకు చెందిన రామిరెడ్డి, ముదనాచారి అనే ఇద్దర్ని ఎవరో దారుణంగా చంపేశారట. ఆ గ్రామంలో వీరిద్దరికీ, కమ్యూనిస్టు పార్టీకి చెందిన వారికీ చాలాసార్లు తగాదాలు అయ్యాయట. బహుశా యీ రాజకీయ విరోధమే హత్యలకు కారణమయ్యుండవచ్చునేమోనని పోలీసులు అభిప్రాయపడుతున్నారట.

## అమెరికాలో మగాళ్ళ క్యాబ్రే!

సామాన్యంగా నైట్ క్లబ్బులలో అందమైన అమ్మాయిలు నృత్యం పేర ఒళ్ళంతా చూపిస్తూ, ఆడిస్తూ అర్ధరాత్రివేళ గెంతడం వింటూ వుంటాం. ఈ చోద్యం చూడ్డానికి పురుష పుంగవులు ఆ స్థలాలకు చేరుతూ వుంటారు. కానీ, ఇప్పుడు అమెరికాలో కొన్ని నైట్‌క్లబ్బులలో అందమైన, చక్కని శరీరం వున్న యువకులు నృత్యం పేర వికార చేష్టలు చెయ్యడం, ఆనక వంటిమీది ఒక్కొక్క బట్టా విప్పి నగ్నంగా ఎగిరి గెంతులు వెయ్యడం జరుగుతోందట. ఈ క్లబ్బులకు వయస్సులో వున్న ఆడవారు, పైగా అంత వయస్సు మళ్ళినా ఉత్సాహం చావని స్త్రీలు, పూర్తి వయస్సు మళ్ళిన వారు కూడా విరగబడి వెళ్తున్నారట. ఇలాటి క్లబ్బులో డ్యాన్సు చేసే మార్కో అనే 21 ఏళ్ల యువకుడు తన పని తనకు చాలా హాయిగా వుందనీ అన్నాడు.

## టైగర్ షార్క్ తెలివి!

ఆస్ట్రేలియా సముద్రం [ఆస్ట్రేలియా సమీపంలో వున్న సముద్రం]లో టైగర్ షార్క్‌కి (ఓ చేపకు) మనిషి పళ్ళలాగా బోలెడు పళ్ళు వుంటాయట. ఈ చేప ఆహారం తిన్న తరువాత తన పళ్ళ మధ్య ఇరుక్కున్న పదార్థాలను తీయడానికో పద్ధతి అవలంబిస్తుందట. సముద్రం ఒడ్డువరకూ వచ్చి నీటిమీద ముఖం పెట్టి నోరు జాపుతుందట. కూక్కూర్ అనే ఓ రకం పక్షి ఆ నోట్లో వాలి, చేప పళ్ళసందుల్లో ఇరుక్కున్న ఆహారపదార్థాలను అది తినేసి చక్కా పోతుందట.

## ప్రాణం తీసిన పగ!

తమిళనాడుకు చెందిన సెందురై పక్క గ్రామమైన సిత్తిరయ్యారు గ్రామానికి చెందిన 45 ఏళ్ళ ఆర్. రామస్వామి ఉడయారు 35 ఏళ్ళ ఎస్. రామస్వామి ఉడయారు ఒకే ఇల్లు కొనడానికి ప్రయత్నించి ఘర్షణ పడ్డారట. ఆర్. రామస్వామి ఉడయారు ఆ ఇల్లు కొనగలిగినందువల్ల ఎస్. రామస్వామి ఉడయారు అతని మీద పగ బట్టి పొలంలో మంచె మీద పడుకున్న ఆర్. రామస్వామి ఉడయారును కసితీరే వరకూ కటకా కత్తితో తూట్లు తూట్లుగా పొడిచి పారిపోయాడట. తెలతెలవారుతుండగా పొలానికి వచ్చిన అతని భార్య రక్తపు మడుగులో తన భర్తను చూసి నివ్వెరపోయి కేక వేసి పడిపోయిందట. పోలీసులు వచ్చి మరణ వాఙ్మూలం వ్రాసుకున్నాక ఆసుపత్రికి తీసుకుపోతుండగా అతను చనిపోయాడట.







## హత్యకి దారితీసిన మేకల తగాదా!

సేలం జిల్లాకు చెందిన తాత్తవేపట్టి యూవ్ కాట్టు అనే చిన్న గ్రామంలో కందస్వామి అనే అతని పొలంలోకి పెరియస్వామి అనే అతనికి చెందిన మేకలు వచ్చి పొలంపాడు చేశాయట. దాంతో కందస్వామి భార్య 35 ఏళ్ల చిన్నమ్మ పోట్లాడే సరికి పెరియస్వామి ఆమెను రాయితో కొట్టాడట. ఈ విషయం పోలీసుకు రిపోర్టు యివ్వాలని కందస్వామి పొరుగూరులో ఉన్న పోలీస్ స్టేషనుకు వెళ్ళి, తిరిగి అడవి దారి గుండా వస్తూండగా దారిలో ఓ చెట్టుకు అతని భార్య చిన్నమ్మ శవం వ్రేలాడుతూ కనిపించిందట. ఆమె వంటి మీద ఒక్క నూలు పోగు కూడా లేకుండా వివస్త్రను చేసి ఎవరో ఆమెమెడకు తాడు బిగించి చెట్టుకు వ్రేలాడదీశారట. ఈ హత్యకూ ఆ పోట్లాటకూ సంబంధం ఉండి ఉంటుందని పోలీసు అనుమానిస్తోందట.

## కోటి కాపీ అమ్ముడయ్యే ప్రావ్దా!

ప్రపంచంలో అధికంగా అమ్ముడుపోయే దినపత్రిక పేరు ప్రావ్దా అట. ఇది రష్యాదినపత్రిక రోజుకు ఒక కోటికాపీలు అమ్ముడుపోతాయట. రెండోపత్రిక చైనా పెకింగుకు చెందిన జిన్—మిన్—జిక్—బా అనే పత్రికట. ఇది రోజుకి పది లక్షలు అమ్ముడుపోతుంటుందట.

## బస్సులో దారుణ హత్య!

తమిళనాడులో పెద్ద కాంట్రాక్టరు, అన్నా ద్రవిడ మున్నేట్ర కజగం పార్టీలో ప్రముఖుడూ అయిన ముత్తు మణిదేవర్ అనే ఆయన బస్సులో ప్రయాణం చేస్తుండగా కొందరు ఆయన మీద హటాత్తుగా పడి, భయంకరంగా ఆయనను చంపివేశారట. తన తండ్రి హత్యను విన్న కరుత్తముత్తు, బావమరిది చెన్నస్వామి, ముత్తు రామలింగం భయంకరమైన ఆయుధాలతో, బోలెడు బలగంతో బయలుదేరి తన తండ్రిని చంపిన వారి మీద దండెత్తి చేతి కందిన అయిదుగుర్ని నరికి చంపివేశారట. ఈ కురుక్షేత్రంలో బోలెడు మంది గాయపడ్డారట కూడా. ముత్తు మణిదేవరు కొడుకు కరుత్త ముత్తుకు బలమైన గాయాలు తగిలి ఆసుపత్రిలో యిదమిత్థం అని తేలని స్థితిలో ఉన్నాడట.

## అయిదు రూపాయిలిస్తే జయమాలిని డ్యాన్స్!

నటి జయమాలిని డ్యాన్సు షూటింగు జరిగే ఫ్లోరులోకి పంపడానికి రహస్యంగా అయినా, సరే ఆ స్టూడియోకు చెందిన పనివారు కొందరు వసూలు చేసి, ఫ్లోరులోపలకు పంపుతున్నారట. స్టూడియోలోకి చచ్చిచెడి వచ్చిన కుర్రాళ్ళు అయిదో, పదో, ఇంకా ఎక్కువో చెల్లించి ఆ ఫ్లోరులోకి వెళ్ళి జయమాలిని నృత్యం చూసి తన్మయత్వం పొందుతున్నారట. అయితే ఎటొచ్చీ అలా ఆ ఫ్లోరులోకి వచ్చిన బోలెడు మంది జనాన్ని చూసిన ఆ ఫలానా సినిమా నిర్మాత ఎవరూ మీరు? వెళ్ళండి బయట. అని గసురుకుంటే ఆ అనాహూతులు తమ హక్కును బయట పెట్టారట. అహో!

## బాల్య వివాహాలు!

బాల్యవివాహాలను ఓ అర్థశతాబ్దం నుంచి భారతదేశం అరికట్టే ఉద్దేశంతో గొడవలు చేస్తూనే వున్నది. అయినా బాల్యవివాహాలలో భారతదేశానిదే ప్రథమస్థానమట. మన దేశంలో రాజస్థానిది ప్రథమ స్థానమట. ఇటీవల రాజస్థాన్‌లో ఓ పిల్ల పెళ్ళికొడుకు (!) ను గుర్రంమీద పెళ్ళికి తరలించుకు పోతుండగా [illegible] ఐస్‌బండి చూసి ఐస్‌క్రీమ్ కావాలని కంటతడి పెట్టి ఏడుస్తే చేసేదిలేక ఓ అయిస్‌కొని ఆ పిల్లాడిచేతికి యిచ్చేసరికి బాలవరుడు ఐస్ నాకుతూంటూ పెళ్ళికి తరలివెళ్ళాడట. ●

రాజమండ్రిలో గోదావరీతీరాన ముత్తయిదువలు చేటలు చెల్లిస్తున్న దృశ్యం.



పితృదేవతలకు ప్రశంసలు చెబుతున్న జంగమదేవర.



# వారఫలం

**21-9-1979 శుక్రవారం మొదలు**
**27-9-1979 గురువారం వరకు**

**మేషం:-** మీరు చేసే ఉద్యోగంలో గాని, వ్యాపారంలో గాని లోపం రాదు. కోర్టు వ్యాజ్యాలుంటే అనుకూలంగా పరిణమించగలవు. క్రమబద్ధంగా చేసే పనులలో ఏమాత్రం లోపం రాదు. మిత్రవర్గీయుల సహకారం కూడా లభిస్తుంది. ఆదాయంలో అభివృద్ధి కలదు. స్త్రీలకు: అన్నిపనులు యథాతథంగా నెరవేరుతాయి. ఏ విధంగా లోపం రానీయని వారం. 27 తా. ఉత్సాహఫల ప్రాప్తి.

**వృషభం:** శుభస్థానంలోని గ్రహవర్గం వల్ల మేలుంటుంది. కొన్ని వ్యవహారాలు వ్యతిరేకంగా కూడా పరిణమించగలవు. ఆరోగ్య లోపం కనిపిస్తుంది గాని, ఆదాయలోపంలేదు. కళారంగంలో ఖ్యాతి లభించే అవకాశమున్నది. రాజకీయ నాయకులకు ఆందోళనకరంగా వారం గడిచిపోతుంది. స్త్రీలకు: ఉద్యోగాభివృద్ధికి దోహదం చేసే గ్రహస్థితి కలదు. 22వ తా. అన్ని విధాలా బాగుండే దినం.

**మిథునం:-** విద్యాభివృద్ధికి, చాలమందికి ఉన్నత విద్యాభ్యాసానికీ, అభివృద్ధి కార్యక్రమం అమలు పరచుటకు, అందమైన వస్త్రాభరణ సేకరణకు అనుకూలమైన వారం. ఆరోగ్యలోపం కనిపించదు. వారఫలం సామాన్యమే అని అనిపిస్తుంది. స్త్రీలకు: విలాసవస్తు సేకరణ, గృహకార్యభారం అధికం. అనుకోకుండా బంధువర్గీయుల రాకపోకలుంటాయి. అందువలన వ్యయం కూడా సంభవమే.

**కర్కాటకం:-** గౌరవానికి, సాహిత్యాభిలాషకు, సభా గౌరవానికి ఏమాత్రం లోపం లేదు. రచనావ్యాసంగం గాని, చలనచిత్రరంగ వ్యాసంగంగాని, సత్ఫలదాయకంగా పరిణమిస్తుంది. మాటల్లో, చేతల్లో మీ ప్రజ్ఞ రాణిస్తుంది. వర్తకం లాభదాయకం. ఉద్యోగంలో అభివృద్ధి కలదు. ఆరోగ్యంలో లోపం కనిపిస్తుంది. స్త్రీలకు: వారాంతం లాభదాయకం.

**సింహం:-** సంఘంలో మాట చెలామణి, గౌరవం, మన్నన, ఇత్యాది సత్ఫలితాలకు ఈ వారం దోహదం చేస్తుంది. లగ్నంలో, శని, రాహువులున్నంతకాలం, ఏ విధంగా చూచినా, ఏదో లోపమున్నట్లు గ్రహిస్తారు. ఆత్మీయులతో సంభాషణ సంతోషదాయకం. విలాసవస్తు సేకరణ ఉంటుంది. స్త్రీలకు: ఆదాయం, అన్నిరంగాలలో అభివృద్ధి చెప్పవచ్చు.

**కన్య:-** దైవకార్యాలు నెరవేరటం, తీర్థయాత్రా ప్రసంగం ఫలవంతం కావటంలో, సంతోషం అతిశయిస్తుంది. అప్రయత్నంగా ఆదాయమున్నది. అయినవారితో మాటపట్టింపులుంటాయి. జాగ్రత్త. స్త్రీలకు: చాలమందికి వ్యయసూచక వారం. ఆరోగ్యలోపం కొంతబాధ.

**తుల:-** గృహపరిస్థితులు బాగుంటాయి. సంతానము వలన సుఖం, ఆనందం సంభవం. ఇరుగు పొరుగు వారితో మాటపట్టింపులుండవచ్చు. అందువల్ల చికాకు ఏర్పడవచ్చు. కాబట్టి మితభాషణ అలవరచుకోవాలి గదా! గ్రంథ ప్రకటనవల్ల, పాఠ్యస్థం చేయటం వల్ల గౌరవం, ఆదాయం సంభవం. స్త్రీలకు: ఉద్యోగాభివృద్ధి, కొందరకు ప్రమోషన్లుండవచ్చు.

**వృశ్చికం:-** అనుకున్న పనులు పూర్తికావాలంటే, ఇంకా కొంతకాలం పడుతుంది. ఇతరులచేతికిచ్చిన ద్రవ్యం చేతికిరావటానికి ఇంకా కొంతకాలం పడుతుంది. ముఖ్యబంధువులు ఇంటికి రావటం, శుభకార్యాలను గూర్చి మాట్లాడటం సంభవం. ఆరోగ్యలోపం లేదు. ఆదాయం సామాన్యం. స్త్రీలకు: రాజకీయ రంగంలో, ఉద్యోగంలో, గృహవిషయాలలో [illegible]. 26 తా. ఉత్సాహదినంగా గమనిస్తారు.

**ధనుస్సు:-** అనుకూలమైన వారం. ఆనందంగా గడుస్తుంది. అందమైన వస్తువులు, కోరి సంపాదిస్తారు. గృహవాతావరణం ఆనందదాయకం. వ్యాపార లాభమున్నది. వ్యవసాయంలో కృషి చేసి, బాధ్యత తీరినదని సంతోషిస్తారు. కృషి చేయండి. అనుకున్న విధంగా లాభాలు పొందుతారు. సంతాన విషయంలో శ్రద్ధ వహించాలి. ఏదో సమస్య వెన్నాడుతూనే ఉన్నది. స్త్రీలకు: దైవ, పుణ్యకార్యాలు నెరవేరతాయి. 22తా. ఉత్సాహదినం.

**మకరం:-** ఆరోగ్య విషయంలో, మీ జ్యోతిష్కుడు హెచ్చరిస్తూనే ఉన్నాడు గదా! వయస్సు మీరినవారు, జాగ్రత్తపడటం ఎంతైనా అవసరం. అంత అవసరమైన గ్రహ విషయంలో చూపించాలి. ప్రత్యక్షంగా ఉపకారం జరుగుట గాని, విరోధివర్గమున్నట్లు గ్రహిస్తారు. స్త్రీలకు: కార్యభారం అధికం, ఆదాయం స్వల్పం.

**కుంభం:-** ఆలస్యంగా పనులు నెరవేరుతాయి. అదీ ఒకవిధంగా మంచిదేకదా! సంఘ కార్యాలలో ఐక్యంకలుగజేసుకొంటారు. వ్యాపారానుకూలతకలదు. పెద్దల ఆదరాభిమానములుంటవి. రాజకీయ రంగంలో చాలమందికి ప్రగతికలదు. కొందరకు, ఉద్యోగంలోని వారికి ఉన్నతపదవులందుకొను గ్రహస్థితికలదు. స్త్రీలకు: వారమంతా హడావుడి పనులతో, పరులకు ఉపకారం చేయటంతో గడిచిపోతుంది.

**మీనం:-** ఆదాయానికి లోటులేదు. గౌరవానికి లోటులేదు. విద్యావయస్సులోని వారు బాగా కృషి చేయాలి. కృషితో నాస్తి దుర్భిక్షం గదా! శుభకార్య ప్రస్తావనలుంటాయి. మిత్ర సందర్శనం, బంధువర్గీయుల రాకకూడ కలదు. అనుకూలమైన వార్తాశ్రవణం వల్ల సంతోషంగా వారం గడుపుతారు. స్త్రీలకు: చాలమందికి వ్యాపారాభివృద్ధి, లాభం చెప్పవచ్చు. 24తా. ఉత్సాహఫలప్రదాయమైన దినం.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# పరమానందయ్య శిష్యుడు

తెలిసి తక్కువ దద్దమ్మలనూ, చెప్పినా అర్థం చేసుకోలేని వారినీ ఈ పేరుతో పిలుస్తుంటారు. దీన్ని వ్యక్తం చేయటానికి కథలెన్నో వాడుకలో ఉన్నాయి. వాటిల్లో యిదొకటి.

గురువు పేరు పరమానందయ్య వీరంతా ఆయన శిష్యులు కాబట్టి, ఊకుమ్మడిగా వారి నందర్నీ పరమానందయ్య శిష్యులంటారు. వారు గురువును మించిన శిష్యులు. ఒకసారి పరమానందయ్య శిష్యులను పిల్చి తనకొకపని చేసి పెట్టాలన్నాడు. అందరూ "ఓ" అన్నారు ఒకేసారి. మనం ఒక విషయం గుర్తుంచుకోవాలి. ఒకర్ని పిల్చినా ఆ శిష్య బృందం అంతా తయారు. ఏదైనా పని చేయవల్సి వస్తే అందరూ కల్సే చేస్తారు. వారు విడిపోని శిష్యపరమాణువులు. గురువు ఒక వూరిలోని ఒక షాహుకారుకు కొంత డబ్బు యివ్వవల్సి ఉంది. శిష్యులను వెళ్ళి ఆ డబ్బు జాగత్తగా తీసుకెళ్ళి యిచ్చిరమ్మన్నాడు. వారు వెళ్ళవల్సిన వూరుకు అడవిదాటి వెళ్ళాలి. కొంచెం దూరం కూడాను. ప్రయాణమై వెళ్ళబోతున్న శిష్యులకు గురువు, ప్రయాణంలో ఎక్కడ చీకటి పడితే, అక్కడే రాత్రి గడ్పి మరునాడు తెల్లవారు జామునే మరల ప్రయాణం కొనసాగించమని చెప్పాడు. ఏ పని చేసినా, అందరూ కల్సికట్టుగా పనిచేసే ఆ పరమానంద శిష్యులు, ఆ డబ్బు సంచిని ఒక గెడకు కట్టుకుని, అందరూ మోసుకొంటూ బైలుదేరారు.

అదే వూరుకు మరొక పనిమీద వెళ్ళవల్సిన షాహుకారొకడు, వీళ్ళు వెళుతున్నారని తెల్సి, జతగా వెళవచ్చునని, తనూ బైలుదేరాడు. కొంత దూరం వెళ్ళారు. చీకటి పడింది. అది అడవి. గురువాజ్ఞ ప్రకారం వాళ్ళు ప్రయాణం చేయకూడదు. కాబట్టి మార్గ మధ్యలోనే పడుకుని రాత్రి గడ్పాలని నిశ్చయించారు. వాళ్ళతో ప్రయాణం చేస్తున్న షాహుకారు, కొంచెం దూరం వెళ్ళితే మరొక వూరుంది, అక్కడ రాత్రి గడ్పవచ్చునని చెప్పాడు. కానీ గురువాజ్ఞను శిరసావహించే ఆ శిష్యులు, గురువు చెప్పినట్టు అక్కడే పడుకోవాలని నిశ్చయించి, గెడను వాళ్ళ తలక్రింద పెట్టుకుని పడుకున్నారు. ఆ షాహుకారుకు ఒంటరిగా వెళ్ళటానికి భయం. అందువల్ల అతను కూడ, వాళ్ళకు కొంచెం దూరంలో పొదచాటున పడుకున్నాడు.




అర్ధరాత్రి, దొంగలొచ్చారు. శిష్యులను చూచి "సన్యాసులు" అంటూ తిట్టుకుంటూ పోబోతుండగా, అది విన్న శిష్యులకు రోషంవచ్చి "మేము ఏమీలేని సన్యాసులమా, మా దగ్గర రెండువేల రూపాయలున్నాయి" అన్నారు ధీమగా. దొంగలు చూపించమన్నారు. "మేము అబద్ధం ఆడం ... చూచుకోండి..." అంటూ గొప్పగా రెండు వేల రూపాయల మూటను చూపించారు. ఆ మూటలో డబ్బును చూచిన దొంగలు "సత్తు రూపాయలేమో" అన్నారు. సన్యాసులకు అంతడబ్బు ఎక్కడ నుంచి వస్తుందిఅనే అనుమానంతో. శిష్యులకు రోషం ఎక్కువయ్యింది.

"సత్తు రూపాయిలిచ్చి, మోసపుచ్చే ఖర్మ మా గురువుకేమీ పట్టలేదు. కావాలంటే డబ్బు విషయం బాగా తెల్సిన కోటీశ్వరుడు. ఆ పొద చాటున పడుకొన్నాడు... వెళ్ళి అడగండి..." అన్నారు. దొంగలు వాళ అదృష్టానికి, ఒకరినొకరు చూసుకొని సంతోషపడుతూ, షాహుకారు వద్ద కెళ్ళారు. అతడి దగ్గర డబ్బును కూడ వీళ్ళ డబ్బుతో పాటు దోచుకుపోయారు.

పరమానందయ్య శిష్యులు అలాంటి తెలివితేటలు గలవారు. ఇప్పటికీ వారిని గురించి ఎన్ని కట్టుకథలు చెప్పినా, వాళ్ళు లెక్కకు ఎంతమందో ఎవరికీ తెలియదు. వాళ్ళు ఎవరో, ఏమిటో, ఎప్పుడెలా తెలుగు సాహిత్యంలోకి, తెలుగువారి జీవితంలోకి కాలు పెట్టారో తెలియదుగాని, "పరమానంద శిష్యులు"గా శాశ్వతంగా నిల్చిపోయారు. రోజుకొకసారైనా ఆ పేరును తలుస్తుంటాం.

— పద్మావతి గంగాధర్



# బొమ్మల మహాభారతం — సైంధవ పరాభవం — మండపాక సీతారామాంజనేయులు

( గత సంచిక తరువాయి )
























[ఇంకా ఉంది]

# నళిని

**చిట్టారెడ్డి సూర్యకుమారి**

( గత సంచిక తరువాయి )

నళినిని చూసి పవిత్ర, పావనీలు ఇల్లు ఎగిరిపోయేలా అరిచారు. నళినిని చూసి రావు, రాజకుమారీలు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. కాని ''ఎందుకు వచ్చావ్ ?'' అని అడగలేదు.

''నీవు వస్తున్నట్లు అమ్మకి తెలుసా ?'' అని మాత్రం అడిగింది.

''లేదు'' అని పిల్లల్లో పడిపోయింది.

ఆరోజు పిల్లలు బడికి పోమని మొండికేశారు. రావుగారు హడావుడిగా ఆఫీసుకు వెళ్ళిపోయారు.

అక్కకి చెప్పాలసివుంది అజయ్ సంగతులు. ఎల చెప్పాలో తెలియలేదు. నిజంగా రాజకుమారి అంటే పిల్లలకి వున్నంత భయం తనకీ వుంది. ఈ పెద్దవాళ్ళ సంగతి అంతుపట్టదు. అంతదానివైయావా? అంటే! అజయ్ వచ్చేదాకా ఆగుదాం అనుకొంది.

తాను వచ్చినట్లు తెలుపుతూ అన్నయ్యని, అమ్మని రమ్మని ఫోన్ చేసింది.

క్షణం ఓ యుగంలా గడపటం అంటే ఏమిటో తెలిసివచ్చింది నళినికి. అణువణువు అజయ్ రాకకొరకు ఎదురుచూశాయి.

ఒంటిగంటకల్లా స్కూటర్ శబ్దం వచ్చింది. పైనుంచి క్రిందికి చూసింది. స్కూటర్ నిలబెట్టి అజయ్ తను పిలిచినట్లు పైకి చూశాడు.

చకోరపక్షి చంద్రోదయను చూసినట్లు, చక్రవాకపక్షి సూర్యోదయం చూసినట్లు, చాతకపక్షి నీలమేఘాన్ని చూసినట్లు, హంస పద్మసమూహంలో ఆడినట్లు నళిని హృదయనాదం పలికింది. ఒకరినొకరు చూసుకొంటూనేవున్నారు. అజయ్ హృదయం లయ తప్పుతూంది కన్నులు కెంపులయ్యాయి. క్రింది పెదవి అల్లలాడింది.

బయటికి వచ్చిన రాజకుమారి అజయ్‌ని చూసి కించిత్ ఆశ్చర్యపోయింది. అతని చూపు ఎక్కడవుందో గ్రహించింది. నళిని హఠాత్తుగా రావటానికి కారణం స్ఫురించింది.

''అజయ్ !'' అంది.

బరువుగా, ''బాబీ ! నమస్తే !'' అన్నాడు. అతని స్వరం ఎక్కడో వుంది. ఆ నవ్వు హుషారు లోపించి ఎలాగో వుంది.

అజయ్ లోపలికి రావటానికి దారి ఇచ్చింది. వస్తూనే సోఫాలో కూర్చుని, తల పట్టుకొని కూర్చున్నాడు. తల చెదిరిపోయింది.

పైన నళిని దరహాస చంద్రికలు అధరాలపై నడయాడుతుండగా, మాచంపై ఓ మూల కూర్చొని అర్కేందు సంగమమందు ఎగిరిపడే సముద్రంలా వున్న మనస్సును అణచుకొంటూ తనను పిలుస్తారో? వాళ్ళ పైకి వస్తారో? అన్నట్లుగా ఎదురుచూడసాగింది.

''అజయ్ !'' అని పలుకరిస్తూ, అరుస్తున్న పిల్లలని గదిలోకి పొమ్మనిచెప్పి అజయ్ ఎదురుగా కూర్చుంది.

రామబాణంలా ఛేదించుకు వస్తున్న నిట్టూర్పును అణచుకోటానికి ప్రయత్నిస్తూ, రాజకుమారి వైపు చూశాడు.

''బాబీ! నేను ... నళిని...''

రాజకుమారి సంబరంగా నవ్వుతూ, ''నీవు, నళిని ప్రేమించుకున్నారా'' అంది.

''పెండ్లి చేసుకుందాం అనుకున్నాం.''

''గుడ్! రాకెట్ వేగంతో మీ ప్రేమ దూసుకుపోయిందే. ఎప్పుడు చేసుకుంటున్నారు?'' హాస్యంగా అడిగింది.

''ఈరోజు...''

''ఈరోజా ? !''

అజయ్ తలూపుతూ ... ''కాని ... ఈరోజే ఫ్రంట్‌కి పొమ్మని ఆర్డర్స్ వచ్చాయి...''

''అజయ్ !'' భయంగా రాజకుమారి గొంతు వణికింది.

''పాకిస్తాన్‌తో వార్ డిక్లేర్ చేసింది ... సారీ బాబీ ... రావ్‌సాబ్ కూడా వెళ్ళాలి...''

రాజకుమారి చెవికి మరో మాట వినిపించ లేదు. తెరుచుకున్న కంటికి మరెవ్వరూ కనిపించ లేదు. మీసాల చాటున తనను చూసి అతిప్రియంగా నవ్వుతున్న రావ్‌గారు కనిపిస్తున్నారు. ఆ స్వరూపం విశ్వమంతా వ్యాపించిపోయింది.

ఆ స్థితిలో వున్న రాజకుమారిని వదిలి పైకి వచ్చాడు అజయ్. కన్నులెత్తి ఆరాధనగా, తనవాడి వైపు ఆశగా చూసింది నళిని.

ఆర్తితో చేతులు చాచాడు. నిస్సంకోచంగా ఆ చేతుల్లో వాలిపోయింది.

''డార్లింగ్ ... డార్లింగ్ ... నళినీ ... మై లైఫ్'' అంటూ జ్వరం వచ్చినవాడిలా కలవరిస్తూనే వున్నాడు.

* * *

పాకిస్తాన్ ప్రతి విషయంలోనూ ఇండియాపై కయ్యానికి కాలు దువ్వుతూనే వుంది. ఢాకాలోని మన దౌత్యోద్యోగులను గృహనిర్బంధంలో వుంచారు ఇండియాలో వున్న పాకిస్తాన్ దౌత్యాలయాలలోని కొందరు 'మాది బాంగ్లాదేశ్' అంటున్న వారిని బలవంతంగా పాకిస్తాన్‌కు పంపమన్నారు. బాంగ్లా ప్రజలు వీరోచితంగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకై పోరాడుతుండగా, ఇందులో భారతదేశం జోక్యం వుందని అపవాదు వేశారు. ఒకవైపు బార్డర్స్‌లో తుపాకిగుండ్లు తగలని, హాని జరగని గుడారాలు, ట్రెంచస్ తవ్వుకుంటూ తాడు తెగేవరకు సాగదీసినట్లుగా సాగదీసింది పాకిస్తాన్. ఇండియా సహనం హద్దులు దాటింది. మంచితనం ఒక్కొక్కసారి పిరికితనం అవుతుంది. అలాగే తలంచిన పాకిస్తాన్‌వారు 'ఒంగోవన్' దాపున అంతర్జాతీయ సరిహద్దుకు 200 మీటర్లు లోపలికి వచ్చి ఇండియా వైపు తుపాకులు పేల్చారు.

బాంగ్లాదేశ్‌లో పాకిస్తాన్ చేస్తున్న మానవ మారణహోమాన్ని చూస్తూ, బోనులో వున్న సింహరాజులా వున్న ఇండియా ఎంతకాలం చూస్తూ వూరుకొంటుంది? సింహనాదం చేసింది; మహిషాసురమర్ధినిలా భారతదేశం.

మధుపర్కాలతో హనీమూన్‌కి వెళ్ళవలసిన అజయ్ యుద్ధానికి వెళ్ళుతుంటే హోరుగాలికి వడలిన తీగలే అయారు గౌరి శంకరులు.

నళిని అజయ్‌ని లతలా పెనవేసుకొని వదలలేదు.

''పదిమంది ముందరైనా నీదాననిపించుకొని వెళ్ళు అజయ్!'' అని ఏడ్చింది నళిని. ఆ కన్నీటిలో అజయ్ హృదయం కరిగిపోయింది.

''నళినీ! నీవు నా భార్యవు అని నాకు తెలుసు, నీకు తెలుసు. కాని సంఘపు కట్టుబాట్లలో నిన్ను బంధించిపోవటం నా స్వార్థమవుతుంది. నాకేమైనా అయితే, నీవేమైపోతావు. నీ భవిష్యత్తు ఏమిటి ... ?''

బదులు చెప్పబోతున్న నళిని నోటిని తన నోటితో బంధించి మరో మాట మాట్లాడనీయలేదు అజయ్

'గుడ్‌బై' చెప్తున్న అజయ్‌ని సరిగ్గా చూడనీయకుండ కన్నీటి తెరలు అడ్డువచ్చాయి రాలిపోతున్న ప్రతి కన్నీటిబొట్టులో అజయ్ వున్నాడు.

మిలటరీవాళ్ళ మానసికంగాఎప్పుడు యుద్ధం

***జరిగిన కథ-9 :*** తమ కాలేజీ చదువు ముగించుకొని బయటపడ్తారు వాసవి, నళినీలు. తరువాత వాసవితో కలిసి వాళ్ళవూరు వెళ్తుంది నళిని. అక్కడి ఆహ్లాదకరమైన గ్రామీణ వాతావరణానికి పరవశించిపోతుంది. కొన్నాళ్ళకు ఆ వాతావరణం విసుగుపుట్టగా, బావ మోహన్‌తో కలిసి వాసవి, నళినీలు లేపాక్షి వెళ్ళి అక్కడి సుందరమైన శిల్పములను, వాటి చరిత్రను తెలుసుకొంటారు. అక్కడినుండి హైదరాబాద్‌లోని తనవాళ్ళ దగ్గరకు వెళ్తుండగా, రైల్వేస్టేషన్‌లో పరిచయమైన కెప్టెన్ అజయ్, తనని ప్రేమిస్తున్నానని చెప్పగా ఆశ్చర్యపోతుంది నళిని. తన తండ్రి మరణించగా, నళిని యిచ్చిన టెలిగ్రామ్‌ను అందుకొని అక్కడకు చేరుతుంది వాసవి అజయ్ తన తల్లిదండ్రులకు వాసవి, నళినీలను పరిచయం చేస్తాడు. వాళ్ళ దగ్గర శలవు తీసుకొని అక్కగారి పిల్లలతో కలసి హకీమ్‌పేట్ ఏర్‌ఫోర్స్ స్టేషన్‌కి వెళ్ళి, అక్కడివన్నీ చూసి, అక్క రాజకుమారి, బావ రావుగార్లతో మెస్‌లో పార్టీకి వెళ్తారు వాసవి, నళినీలు. కొన్నాళ్లకు వాళ్ళు యూనివర్సిటీలో చేరగా, అజయ్ వచ్చి నళినిని తీసుకుపోతాడు. అనుకోకుండా 'జూలాజికల్ రెస్టుహౌస్'లో అజయ్, నళినీలు ఏకశరీరులైపోతారు.

వచ్చినా పోవటానికి సిద్ధంగా వుంటారు. వార్ వచ్చింది. చేతుల దురద తీర్చుకోవాలని వుత్సాహ పడుతున్నారు కొందరు. జీవితం ఎప్పుడూ ఒకలాగే వుంటే అందులో 'థ్రిల్' ఏముంటుందని? అనుకున్నవారు, పెండ్లిళ్ళు చేసుకోవలసినవాళ్ళు వాయిదాలేస్తూ 'తిరిగి బ్రతికివస్తే చేసుకుంటా' అన్నారు. భార్యాబిడ్డలు వున్నవారికే కష్టం. మనస్సు పీకుతుంది తమ బాధ్యత విస్మరించకుండ దేశంకోసం పోరాడాలి. ఉన్న కాస్త సమయంలో భార్యాబిడ్డల భవిష్యత్తుని ఆలోచిస్తూ, సాధ్యమైనంత ఎక్కువగా జీవితభీమాలు చేశారు. అయిన వాళ్ళకి అప్పగింతలు పెట్టారు. అన్ని సౌకర్యాలు అమరేలా చూశారు. అక్కడే వున్న వారికి తోడుగా, ఎప్పుడూ పనిచేయటానికి కుటుంబానికో మనిషి యిచ్చారు. (బాట్స్‌మాన్).

భార్యలు, భర్తలు యుద్ధానికి పోతుంటే, ఆయుస్సు వుంటే ఎక్కడైనా క్షేమంగా వుంటారని అంతా దేవునిపై భారం వేశారు.

సాధారణంగా తెలుగాడ పడుచులు పిరికివారు. భర్త, పిల్లలు చేతి కందుబాటులో వుండి ఎప్పుడు కంటికి కనుపిస్తుండాలని కోరుకుంటారు ఇష్టంగా ఏ తల్లి ఆర్మీలోకి పంపదు. "వద్దురా నాయనా! బ్రతికివుంటే బలుసాకు తినైన బ్రతకవచ్చు" అని పిరికిమందు పోస్తుంది. దేశం కోపం తప్పనిసరిగా, విధిలేక వారు పోతుంటే చేసేదిలేక కన్నీరు కార్చుతుంది.

రావుగారు వెళ్ళేటప్పుడు, వుగ్గబట్టి నిల్చున్న రాజకుమారి ఆయన కనుమరుగు కాగానే కుప్పలా కూలిపోయింది.

పిల్లలు నోరెత్తటానికి భయపడ్డట్టు, ఏడుస్తున్న అమ్మకి దూరంగా బిక్కు బిక్కుమంటు నిల్చున్నారు. రాజకుమారికి తోడుగా ఆ యింట్లో వుండటానికి అమ్మ వచ్చింది. అన్నయ్య, వదినావాళ్ళు ఎక్కువ సమయం ఇక్కడనే గడిపేస్తున్నారు. నళిని తిరిగి వాసవిని చేరుకొంది. మనస్సు దేనిమీద నిలవనంటుంది. చదువుమీద లగ్నం చేయలేకపోయింది. ట్రాన్సిస్టర్ ప్రక్కనుంచుకొని, 'ఏ క్షణాన ఏమి వింటానో నన్నట్లుగా వార్తలు వింటూ, రాత్రిళ్ళు ఇంత దీర్ఘంగా వున్నాయే, పగలు గడవనంటుందే?' అన్నట్లు గడపసాగింది.

* * *

1857లో ఇండియన్ ఆర్మీలో 130,000 భారతీయ సిపాయిలు వున్నారు. తర్వాత అప్పుడప్పుడు చేరినవారి సంఖ్య 70,000 అయింది. అందులో మళ్ళీ 30,000 మంది ఆర్మీని వదిలిపెట్టినట్లు లెక్కలు తేల్చారు.

ఒక ప్రదేశంవారు కాదు. ఒక జాతివారు కాదు. భారతీయులందరు ఒకటై యుద్ధంలో పాల్గొన్నారు. దేశంకోసం సమానంగా పోరాడారు. ప్రతి ఒక్కడూ సైనికుడే అని చాటించాడు. కాని కొందరు 62 సంవత్సరమునాటి చీకటి రోజులను మరువలేకున్నారు. చైనా యుద్ధంలో తప్పటడుగు వేశాం. 'మన పరాజయానికి చైనీయులే ఆశ్చర్యపోయారు' అని గుస గుసలాడుకొని ప్రాణాలు బిక్కబట్టుకున్నారు. ఆ రోజుల్లో మనం ఏ యుద్ధానికి తయారుగా లేము. పైగా ఇండియాతో చైనా "భాయ్ – భాయ్" అంటూనే వెన్నుపోటు పొడిచింది నేల ఈనినట్లు తరలివచ్చిన ఆ సైన్యాన్ని, వారి ఆధునిక ఆయుధాలను చూసి విస్తుపోయారు. చైనా సైనికులు వారితోపాటు మౌంటెన్ గన్స్ హెవీ మోర్టార్ తెచ్చారు. మంచుకొండల్లో యుద్ధానికి రెడీగాలేరు. మనవాళ్ళు ఆ శిక్షణలో తర్ఫీదు పొందలేదు. అయినా ప్రాణాలకి తెగించి పోరాడారు. వెనుకాడలేదు. ఎందరి ప్రాణాలో బలైపోయాయికాని పూర్తిగా ఓడిపోయింది.

ఈసారి నూతనోత్సాహంతో యుద్ధసన్నద్ధులై వెన్నుపోటు పొడిచే అవకాశం యివ్వక సరియైన సమయానికి ప్రతి బార్డర్‌లో ఆరువందల నలభై కిలోమీటర్ల దూరంలో వుండే, మన సైన్యాలు సరిహద్దులను చేరుకున్నాయి.

కాశ్మీర్, కచ్, పఠాన్‌కోట పొడవునా యుద్ధానికి తయారుగా వున్నాయి.

1971 డిశంబర్ మూడో తారీఖు సాయంత్రం ఆరుగంటలకి పాకిస్తాన్ ఆకస్మాత్తుగా ఇండియాపై యుద్ధం ప్రకటిస్తూనే 'ఎయిర్ ఫీల్డ్స్'పై దాడి జరిపింది.

సుమారు ఆరుగంటల తర్వాత తిరిగి వాటిని కొట్టుదామని ఇండియా తీర్మానించుకుంది.

ఇరవైనాలుగుగంటలలో తిరుగుదెబ్బతీసి పాకిస్తాన్ విమానాలను వికలాంగులనుచేసి గుణపాఠం నేర్పింది. ప్రతి వైమానికుడు హీరో అనిపించుకున్నాడు.

వింగ్ కమాండర్ హరిచరణ్ రెండువందల కి మీ. దూరం పాకిస్తాన్‌లోకి చొచ్చుకొని వెళ్ళాడు. అక్కడ బాంబులను వేయటమేగాక శత్రు స్థావరాలను ఆ పరిసరాలను ఫొటోలు తీసుకొని వచ్చాడు. అతని విమానం కంట్రోల్ సర్‌ఫేస్ శత్రువుల తుపాకీలకి గురైంది. విమానం ఎక్కువగా దెబ్బతినింది. అలాంటప్పుడు విమానంలో వుండటంగాని నడపడంగాని అసాధ్యమే అవుతుంది అట్టి సమయంలో వైమానికుడు ప్రాణం రక్షించుకుంటానికి ప్రయత్నిస్తాడు. బయటికి వచ్చేస్తాడు. ఖైదీగా చిక్కిపోతాడు. అట్టి పరిస్థితులలో కూడా ధైర్యసాహసాలతో విమానాన్ని వెనక్కి తెచ్చి మాతృభూమిపై ఆపాడు.

అదే పాకిస్తాన్ వైమానికులు వారి విమానానికి కాస్త దెబ్బ తగిలినా వారి సరిహద్దుకు అట్టే దూరం లేకపోయినా బయటికి దూకి ఖైదీగా చిక్కి ప్రాణాలను నిలుపుకుంటున్నారు.

కాని ఇండియా వైమానికులు వాండ్లు అనుకున్నప్రకారం నాశనంచేసికాని తిరిగిరాటల్లేదు. మన సుకాయిన్ లాహోర్ వాజీరాబాద్ గడగడలాడించాయి.

మన విమానాలు రాబందులా వొపిగ్గా సొర్‌గొదా, షొర్‌కొట్, మియాన్‌వాలి కరాచి దగ్గర మాస్‌రౌన్‌లపై ముసురుకొని భయాన్ని కలిగించాయి.

విరామంలేకుండా అప్రమత్తతతో విమానాలు పహరా యిస్తూ డేగల్లా ఆకాశంలో తిరిగాయి.

శత్రు విమానం కంటబడగానే అతి దగ్గరలో వున్న ఎయిర్ ఆబ్సర్‌వేషన్ పోస్టుకి తెలియ పరచేవి. అలాటి ఆబ్సర్‌వేషన్ పోస్ట్‌లు కొన్ని వందలమైళ్ల దూరానికి ఒక పోస్టు వుంది.

ఒక పోస్ట్ నుంచి మరో పోస్టుకి నిమిషాలపై






అమెరికా అధ్యక్షుడు శ్రీ జిమ్మీ కార్టర్ దేశంలో ఇంధన సమస్య పరిష్కారానికి తాను ప్రతిపాదించిన సంస్కరణలకు ప్రజల మద్దతు కోసం ప్రచార యాత్రకి సతీమతలలో మిసిసిపీ నదిలో ప్రయాణం చేసిన "డెల్టా క్వీన్". ఆవిరి శక్తితో నడిచే పాతకాలపు కొయ్య నౌక యిది 188 ప్రయాణీకులకు, 77 మంది నౌకా సిబ్బందికీ వసతులుగల దీని పొడవు 87 మీటర్లు. వినోదయాత్రలకు ఉపయోగించే యిలాంటి నౌకలు అమెరికాలో రెండే వున్నాయి రెండోదానిపేరు "ఓల్డ్ మిసిసిపీ క్వీన్". మిసిసిపీ నదిలో ప్రయాణం చేస్తున్న డెల్టాక్వీన్‌ని చిత్రంలో చూడవచ్చు

ఓ ఫెన్సు హెడ్ క్వార్టర్స్‌కి తెలిసిపోతుంది అంత జాగరూకతో పెట్రోల్ మిషన్ పనిచేసింది.

శత్రు విమానాలు ఐ. ఎ. ఎఫ్ గుర్తులతో ఇండియా విమానాలన్నట్లుగా,వచ్చాయి ఆ మోసా లేమి సాగనీయక రాళ్ళు విసిరి కాకుల్ని తరిమినట్లు తరిమికొట్టారు.

ఇండియా విమానాలను చూడగానే పాకిస్తాన్ విమానాలు తోకలు ముడిచి వెనక్కి మళ్లేవి. ఇండియా వైమానికులకు విసుగుపుట్టింది.

ఎదురుతిరిగి యుద్ధం చేయరేం! యాక్షన్ కొరకు వుబలాట పడుతున్న మన వైమానికులకు నిరుత్సాహం కలిగింది. అప్పటికీ చాలా తక్కువ ఎత్తులో శత్రుస్థావరాలపై ఎగిరి — కాలుదువ్వు తున్నా వెనక్కి తగ్గిపోతున్నారు పాక్ సైనికులు. అలా ఎదురు చూస్తున్న భారత్ భూషన్ కంట పాకిస్తాన్ స్టార్ ఫైటర్ కనపడింది. రెండు వందల అడుగుల ఎత్తులోకి దిగి వెయ్యి రెండు వందల కి.మీ వేగంతో మూడు వందల మీటర్ల దూరంలో వుండి తూటాలు కురిపించాడు. స్టార్ ఫైటర్ మంటల్లో బ్రద్దలైంది.

''అంతా క్షణాల్లో జరిగిపోయింది. అదీ అంతా ఛాన్సు, శత్రువు ఏమందు చూసి వుంటే

## నళిని

ఆ దెబ్బ తనమీద తీసే అవకాశం వుంది'' అని నవ్వుతూ చెప్పారు భారత్ భూషణ్.

శత్రు విమానాలు సరిహద్దు దాటి పట్టణాల్లోకి రాచూస్తే సరిహద్దుల్లో వున్న సిగ్నల్ ఆఫీసర్ రాడార్‌లో చూసి సిగ్నల్స్ పంపుతూ వుంటాడు, హెడ్ క్వార్టర్స్‌కి. అలాగే మన విమానాలు సరిహద్దులు దాటి శత్రువుల వైపుకు పోయినా ఎప్పటి కప్పుడు సిగ్నల్స్ ఇస్తూంటాడు

పట్టణాలకి కొన్నిమైళ్ల దూరంలో రాకెట్ స్టేషన్స్ వుంటాయి అవి వూరి బయట పెద్ద పెద్ద పట్టణాలను కాపాడ తూ వుంటాయి

శత్రు విమానం వస్తూందని పసిగట్టి ఇక్కడ నుంచే గురిచూసి కొట్టినట్లు రాకెట్స్‌ను వదులుతారు అలా ఢిల్లీ స్క్వాడ్రన్ వాండ్లు శత్రు విమానాన్ని కూల్చేశారు మరొక్కటి వస్తే బాగుండు, అని కూల్చాలన్న సరదాకి అన్నం నీళ్లు లేకుండా కాపలా కాశారు.

పాకిస్తాన్ సాబర్సు ఆరు వచ్చాయి. శ్రీనగర్ ఎయిర్‌ఫీల్డుపై పెద్ద అలలాగ వచ్చిబడ్డాయి. ఎయిర్‌ఫీల్డుని పాడుచేసే అలాగే శ్రీనగర్ పట్టణంని పాడుపెట్టుదామన్న ఆశతో వచ్చాయి. కొన్ని నిముషాల ముందే మన విమానం పైకి పోయింది. చుట్టూ దుమ్ము కమ్ముకొంది. దారి కనపడుట లేదు. మరో విమానం అట్టి పరిస్థితులలో పైకి పోయి వాటిని ఎదుర్కోవటం కష్టం — కాదు అసాధ్యమైన పని. ఆ సమయంలో నిర్మల్ జట్ విమానం రామబాణంలా పైకి లేచింది. ఆ సాబర్సు వైపుకు దూసుకుపోయింది. పోతూండగానే ఒక సాబర్‌ను కూల్చేసింది—మరోదాన్ని పడేలా చేశాడు మిగిలిన నాలుగు సాబర్స్ రేసు కుక్కల్లా నిర్మల్ జట్‌ను చుట్టుముట్టాయి. ఒకదానిపై వాలుగు- పోటీ ఎక్కువ నిర్మల్ జట్ తిరిగిపోవచ్చు — కాని అభిమన్యుడిలా వాటిపై తిరగబడ్డాడు. చెట్టంత ఎత్తులో కుక్కల కొట్లాటలాంటి ఆ విమాన యుద్ధాన్ని నిర్మల్ జట్ వీరోచిత కార్యాలను వందల కొద్దీ శ్రీనగర వాసులు మిద్దెల పైనుంచి చూశారు. ఆ నాల్గింటిపై దెబ్బపై దెబ్బ తీశాడు కాని నిర్మల్ జట్ విమానం నేలకూలింది.

అతని ప్రాణాలను అర్పించి శత్రువుల నుండి శ్రీనగర్‌ని కాపాడినాడు. భారతమాత మరో అభిమన్యుని పోగొట్టుకుంది.

*  *  *

విమానాలు పైన లైనుగా వెళ్తుంటే ఆ విమానాల గొడుగు క్రింద పదాతులు (కాల్బలము) ముందుకి సాగుతూవుంటుంది. శత్రువులు ముందు నుంచి అకస్మాత్తుగా పైన పడకుండా—పైనుంచి శత్రు విమానాలు బాంబులు వేయకుండా పైన కాపలా కాస్తూన్నట్లుగా పోతాయి, విమానాలు. గన్నర్ ముందు సాహసంగా ముందు నడుస్తూంటే దాని వెనుక సైనికులు వస్తారు వారి వెనుక వాహనాలు బాగుచేసే మెకానిక్కులు—అప్పటికప్పుడు వంతెనలను కట్టే ఇంజనీర్లూ వస్తారు.

పైనున్న ఫైటర్ విమానాల్లో ఒకదానిలో రావుగారున్నారు. ఇప్పుడు ఆయన బాధ్యతగల ఆఫీసర్ తన నాయకత్వంలో తనను నమ్మి ముందుకు సాగుతున్న సోదరులను అతి జాగ్రత్తగా కోడి, తన పిల్లలను డెక్కల క్రింద దాచిన విధమున అతి జాగరూకతో తన బాధ్యతను నెరవేరుస్తున్నాడు. ఆ సమయంలో తన ప్రాణప్రదమైన భార్యగాని ప్రియమైన బిడ్డలు గాని అతని మనస్సులో లేరు. స్వవిషయాలు ఏవీ గుర్తులేవు. కార్యదీక్ష – దేశ రక్షణ అతని ప్రథమ కర్తవ్యంగా వుండి మమతాను బంధాలను ఆ సమయంలో దూరంగా వుంచినట్లు ఇనుప మనిషిలా వున్నాడు.

రావుగారి నాయకత్వంలో ఎయిర్ ఫోర్స్ సహాయంతో పటాలం నిర్భయంగా ముందుకు వెళ్ళాయి.

*  *  *

మేజర్ హోషియార్‌సింగ్ తన కంపెనీతో రాత్రివూట బాసాంతార్ నదిని చలిలో చల్లటి నీళ్ళల్లో దాటారు. శత్రువులు ఎదురుగా చేతి కందుబాటులో వున్నారుగని అతిజాగ్రత్తగా బార్బ్‌డ్‌వైర్ ప్రాకారంలో చుట్టూ మీడియం గన్స్‌తో వున్నారు.

పటాలం రెండు భాగాలుగా వీడి ఒక భాగము కాప్టన్ అజయ్ కమాండులో ఎడమవైపుకి -- మిగిలిన భాగము మేజర్ కమాండులో కుడివైపుకి వెళ్లారు.

ఆ పటాలానికి వుంది ఒకే వైర్‌లెస్‌సెట్. అవతలివాళ్ళు ఎలావున్నారు ? ఏం చేస్తున్నారో ఇవతలివాళ్లకు తెలియదు. కాల్పులు తీవ్రంగా జరుగుతున్న సమయంలో మేజర్ హోషియార్‌సింగ్ ఈ స్థలం నుంచి ఆ స్థలంకి కడుపుమీద ప్రాకుతూ, వెళ్లి వాండ్ల ప్లాను ప్రకారం యుద్ధం సాగుతుందా లేదా అని చూస్తుండేవాడు.

ఇండియా రెండు సైన్యాల మధ్య పాకిస్తాన్ సైన్యం వుంది. ఆ చీకట్లో ఘోర యుద్ధం జరిగింది. కొంతమంది శత్రు సైన్యాలు చెరకు పొలంలో వుండి ఇండియా ట్రూప్స్‌పై కాల్పులు

సాగించారు. ఆ చీకట్లో ఎటునుంచి కాల్పులు వస్తున్నాయో అని కొంతసేపు తికమకపడ్డారు.

తెల్లవారేటప్పటికి జాక్‌పాల్ గ్రామం ఇండియా జవానులు ఆక్రమించుకున్నారు. పాక్ సైనికులు ఖైదీలుగా చిక్కారు.

పట్టుబడిన పాకిస్తాన్ సైనికులు నోరు విప్పలేదు. శిలాప్రతిమల్లా వుండిపోయారు.

కొంతమంది ఈ యుద్ధం మాకు ఇష్టంలేదు 'యాహ్యా'కోసం చేస్తున్నాము అని చెప్పారు.

కాప్టన్ అజయ్ తుపాకీ చేతపట్టి తన కామ్రేడ్స్‌తో బంకర్ నుంచి మరో బంకర్‌కి తిరిగి దాక్కున్న శత్రువులను బయటికి లాగడం ఆ బంకర్స్‌లో వున్న తూటాలు—తుపాకీలు—మెషన్ గన్స్ చేతి బాంబులు అధీనపరచుకున్నారు. వాటి మధ్య లిప్‌స్టిక్కులు—స్త్రీల అలంకరణ సామాగ్రి బురఖాలు పగిలిన గాజు ముక్కలు వున్నాయి.

యుద్ధ సమయంలో కూడా వారు కామాతురత కలిగి వున్నారు. స్త్రీలను అండర్ గ్రౌండ్ బంకర్స్ కూడ తెచ్చుకున్నారు. సుఖాలకి అంతగా అలవాటు పడిపోయారు. ఎంతగా దిగజారిపోయారు! ఛీ వీళ్ళు — యుద్ధం చేయటానికి కూడ తగరు.

అజయ్‌కి ఏదో మధురమైన జ్ఞాపకాలు వచ్చాయి. 'మై డార్లింగ్ లవ్, నళిని! ఏం చేస్తున్నావోయ్' అని తలచుకున్నాడు

నిర్జనమైన ఆ గ్రామంలోకి వెళ్ళారు. అప్పటికప్పుడే ఇండ్లు వదలి పారిపోయినట్లున్నారు

ఒక ఇంటిముందు పెళ్లిపందిరి - పెండ్లి సామానుతో ఆ ఇల్లు నిండుగ వుంది మరో ఇంట్లో కొత్తపాపకి వేయించిన కొత్త వుయ్యల వూగుతుంది. ఆ చిన్నారి పాప ఆ ఇల్లాలు ఎంత భయంతో పారిపోయిందో? చిన్నపిల్లలు ఆడుకునే బొమ్మలు, సరికొత్త వున్న చిన్న పేముకుర్చీలు మరో ఇల్లు—ఇలా ప్రతి ఇల్లు ఇండియాలో వున్న ప్రతి ఇంటికి ప్రతిబింబంలా వున్నాయి. ముచ్చటగా వున్న ఆ కుర్చీలను చూసి ఇంటి దగ్గర చిన్న పిల్లలు గుర్తుకు వచ్చిన జవాను అవి చేతికి తీసుకున్నాడు.

'వద్దు' అన్నట్టుగా అజయ్ చెయ్యి అడ్డు పెట్టాడు అతను కోపంగా అజయ్ వైపు చూశాడు. కాని అజయ్ కళ్లల్లోని నీరు చూసి అతని కళ్ళూ చెమర్చాయి

వాండ్లు ఆ గ్రామాన్ని దోచుకోలేదు. నిప్పు పెట్టలేదు. అక్కడ దాగిన శత్రు సైనికులను మాత్రం పట్టుకొని వచ్చారు.

తిరిగి తమ స్థావరాల్లోకి వెళ్లిపోయారు తిరుగు దెబ్బ తీయటానికి శత్రువులు మళ్లి కొత్త సైన్యంతో రావచ్చు, అని వారికొరకు ఎదురు చూడసాగారు.

సైనికులు గుంపులుగా ఒక దగ్గర వుండరు ఇద్దరు ముగ్గురుగా పొదల చాటున చెట్లచాటున అహర్నిశలు యునిఫారమ్‌లో వుంటారు.

టెన్నుల్లో వున్న ఆహారం తింటారు సమయమున్నా వంట చేసుకోరు. పొగనిప్పును చూసి శత్రువులు పసికట్టవచ్చు.

శత్రు శవాలకి ఏ ఒక్క అవయవము వుండవలసినచోట లేదు. వికలాంగులైనారు. తమవారికి ఎంతో దూరంగా దహనం చేయబడ్డారు. చావు ఎప్పుడు ఏ రూపాన వస్తుందో తెలియదుగాని అంతిమయాత్ర శుభ్రంగా తనవారి ముందు చేయాలని, తమ గుర్తుగా ఓ సమాధి అంటూ వుండాలని వుంటుంది. సైనికునికి ఆ కోరిక తీరని కోరికే అవుతుంది.

తింటున్న పదార్థం ఇక లోనికి పోలేదు వాటర్ బాటిల్లోని నీరుతో నోరు తడుపుకున్నాడు అజయ్.

చెట్లల్లో నుంచి కనుపించే నీలాకాశం దగ్గరలో గలగలమని పారుతున్న కాలువ, ఏవో మధురస్మృతులను రేపుతూంది. కాస్త విశ్రాంతిలో హృదయ కవాటాలను తెరుచుకుని నళిని బయటకు వస్తుంది. ఏది చూసినా నళిని అందులో కనుపిస్తుంది. సీతను బాసిన రాముడికి కనిపించినట్లు — కలువమొగ్గల్ని చూసి సీత కుచములున్నట్లున్నాయి అనుకునేవాడు. హంస నడక సీత నడకను గుర్తుకు తెస్తుందని బాధపడేవాడు. పద్మాలల్లో సీత ముఖాన్ని చూసేవాడు. దొండపండును చూసి సీత అధరాలలోని తీపి గుర్తుకువచ్చి మదనతాపాన్ని కలుగజేసేది. అసలు ఆ వనం అంతా సీతలాగా కనపడేదట.

చెట్టు బోదెకు జారగిలబడి అజయ్ కన్నులు మూసుకున్నాడు తొలి వలపులోని మధురాన్ని తలచుకున్నాడు శరీరమంతా తియ్యని బాధకి గురైంది.

''మై డార్లింగ్ — డార్లింగ్ నళిని'' అంటూ నళినిని పదే పదే స్మరించసాగాడు. ఆ రాత్రి...? అజయ్ అధరాలపై మెత్తగా తియ్యని హాసం నడయాడింది. ''ఆ చిన్న మృదువైన హస్తాలు తన తలను అదిమిపట్టుకున్నాయి. తొలి వలపులోని తీయని బాధను సహిస్తూ ... ఆ క్షణంలో నళిని కావాలని కోరిక బలమైంది. ఆ అనుభవం మళ్ళీ మళ్ళీ మళ్ళీ పొందాలి. ఎప్పుడు? ఇంకెప్పుడు? మైగాడ్.'' బాధగా మూలిగాడు.

అంతలో మరో ఆఫీసర్ వచ్చి ''మిస్టర్ అజయ్'' అని పిలుస్తూ అతని సుందర స్వప్నాన్ని కరిగించాడు.

విప్పుకున్న అజయ్ కళ్ళు ఎర్రగా, తడిగా వున్నాయి.

వయసులో పెద్దఅయిన అతను ''అజయ్'' అన్నాడు లాలనగా, ఆత్మీయులు గుర్తుకువచ్చారని గ్రహించినవాడై.

''పెట్రోలింగ్‌కి పోవాలి పద'' అన్నాడు.

తమ సరంజామా వీపుకి తగిలించుకొని గన్ పట్టుకొని చెట్లల్లో నీడల్లా కలసిపోయారు.

ప్రక్కనున్న తోటి ఆఫీసర్ మెల్లిగా ఏదో చెప్పుతూ తనను తాను తృప్తిపరచుకుంటున్నాడు.

''మిస్టర్ అజయ్! ఇంటిదగ్గర నేను చేయవలసిన పనులు ఏవీ లేవు. ఇద్దరు కూతుళ్ళకి పెళ్ళిళ్ళు చేశాను. ఆ పని చేసినందుకు నాకిప్పుడు సంతోషంగా వుంది. పెద్దవాడు బి. ఇ పూర్తిచేశాడు. ఎయిర్‌ఫోర్సుకి పోతానంటున్నాడు. చిన్నవాడు కాలేజీకి వచ్చాడు. నా శ్రీమతికి ఇద్దరు కొడుకుల్ని ఇచ్చాను...ఇంకేమి కావాలి...?''

మాటల్లో కాలువ దగ్గరకి వచ్చారు. కాలువ చిన్నదైనా ప్రవాహం వేగంగానే వుంది.

ముందు జవాను ఈదుకుంటూ వెళ్లాడు అతన్ని చూసి జాలివేసింది. అతనికి రెండురోజులుగా జ్వరం. ఒకదగ్గర వుండి రెస్టు తీసుకోమంటే, వినలేదు. అలా వుండిపోతే పిరికివాడని అనుకుంటారేమో! తోటి సోదరులు యుద్ధం చేస్తుంటే తాను విశ్రాంతిగా వుండలేదు.

అజయ్ దిగాడు. నడుముపైకి వచ్చాయి నీళ్ళు లోతులేదు. వెనుకవున్న అతన్ని రమ్మంటూ కాలువ దాటాడు, వెనుక వున్న ఆఫీసర్ కొరకు

## నళిని

చూశాడు. కనపడలేదు. ప్రక్కకి చూశాడు. దురదృష్టవశాత్తు కరెంటులో చిక్కుకుని కొట్టుకుపోతున్న అతన్ని చూశాడు. సహాయం కొరకు అతను అరవలేదు. అరవటంలేదు. ఆ కేక శత్రువులు వింటారేమో! అన్నట్లుగ నిశ్శబ్దంగ ఆ ప్రవాహం నుంచి తప్పించుకోటానికి ప్రయత్నం చేస్తున్నాడు.

అజయ్ ప్రవాహం వెంబడి పరుగెత్తసాగాడు. అతను ఏదో అడ్డుకొని ఆగినట్లున్నది. ఇక అందుకోవచ్చు అనుకుంటూ నీళ్లల్లోకి దూకి ఈదుకుంటూ వెళ్ళాడు. ఆ జవాను సహాయంతో వడ్డుకు చేర్చాడు. కాని అతని అలసిపోయిన ప్రాణం నీళ్లల్లో మృత్యురూపాన దాగిన రాయికి తలకి కొట్టుకోగానే అతన్ని వదిలిపెట్టినది.

పళ్ల బిగువున దు:ఖాన్ని అణచుకొని ఆ కాలువ ఒడ్డున్నే అతన్ని సమాధి చేశారు.

బరువెక్కిన హృదయాలతో మిగిలిన ఆ ఇద్దరూ గస్తీ తిరగటానికి, శత్రువుల వునికి కని పెట్టటానికి వెళ్లారు.

అలా చెట్లల్లో ముళ్లపొదల్లో మెత్తగా ఒక్కొక్కసారి చేతులు కాళ్లమీద కోతిలానడుస్తూ పోతుండగా—జయ్—మంటూ తూటాలు వచ్చి వారి ముందు పడసాగాయి. తూటా వస్తున్న శబ్దానికే- ఆ ఇద్దరు ప్రక్కకి ఒరిగి – నేలకి అంటుకు పోయారు. కాని...అప్పటికే ఒక తూటా ప్రక్కనున్న జవాన్ గుండెల్లో నుంచి దూసుకుపోయింది. అజయ్, ప్రాణాలను పొగొట్టుకున్న ఆ సోదరుని చూస్తూండిపోయాడు. శత్రువులపై పగతో వళ్లు కాలిపోయింది ఆ వేడికి క్రిందనున్నభూమి అంతా వెచ్చబడింది.

* * *

చీకట్లు నలువైపులా క్రమ్ముకుంటున్నాయి. పాకిస్తాన్ సైనికునిలా వున్న ఇండియన్ సిపాయి వచ్చి పాకిస్తాన్ వారు టాంకులతో రేపు యుద్ధానికి వస్తారు. అని వార్త అందించి ఆ చీకటిలో కలసిపోయాడు.

పాకిస్తాన్ సైనికులు అనుకున్నట్టే ముందుగా వచ్చి కాల్పులు సాగించారు. ఇక్కడ వున్న ఇండియన్ ట్రూప్సకన్న అధిక సంఖ్యలో రావడమే గాకుండా చైనీస్ మేడ్ టి. 59 టాంకులతో వచ్చి అటాక్ చేశారు. కొంతకాలంగా శత్రు భేద్యంగా చుట్టూ దట్టంగా మెయిన్ ఫీల్డ్స యేర్పాటు చేసుకున్నారు.

(నేలంతా బాంబులు పెట్టుతారు. అడుగు పెట్టగానే పేలుతాయి. ఎంతదూరం – ఎక్కడ వుంటాయో తెలియకుండా అమర్చుతారు. అలాటి ఏర్పాట్లు ఎప్పటినుంచో చేసుకుని అన్నిటికీ సిద్ధపడి ఇండియాపై యుద్ధం ప్రకటించారు.)

పాకిస్తాన్ వాళ్ళు దూర దూరంగా వుండి దోబూచులాట ఆడినట్లు యుద్ధంచేస్తూ మన రాకెట్సుకు భయపడి అలా వచ్చినట్లే వచ్చి వెనక్కిపోతూ – బాంబులు ఎక్కడ వేస్తున్నారో

# ఇప్పుడు! హాయిగా సేవించండి సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ!

# లిప్టన్ టాప్ స్టార్ టీ

చిక్కని కమ్మని టీ కోసం నిజంగా మీరు ఎదురు చూస్తున్నారు. అదే క్రొత్త లిప్టన్ టాప్ స్టార్. అత్యుత్తమమైన మంచి ఎగుమతి రకం డస్ట్ టీ రకాలను మేళవించి చిక్కటి కమ్మని టీ కోసం చూచే మీలాంటి వారి కోసమే యీ టీ.
నేడే లిప్టన్ టాప్ స్టార్ కావాలని అడగండి.
పూర్తిగా ఫాయిల్‌లోనే ప్యాక్ చేసారు గనుక తాజాగా, చిక్కగా, కమ్మగా మీరు కోరినట్లు వుంటుంది.






LT/CAS-1/77R TEL

## సంతృప్తి నిచ్చే స్ట్రాంగ్ టీ

అవి ఎక్కడ పడుతున్నాయో తెలుసుకోకుండానే ఇష్టంవచ్చినట్లు వదలి పారిపోతుండేవారు. భారత సైనికులు విసుగు, కోపంతో రెచ్చిపోయారు.

రాత్రికి రాత్రి కోతులను తెచ్చి మెయిన్‌ఫీల్డులో వదిలారు. అవి ఇష్టంవచ్చినట్లు గెంతుతూ పోతుంటే వాటి అడుగు పడినచోటల్లా బాంబులు పేలేవి. అలా కలియుగంలో కోతులు ప్రాణదానం చేశాయి.

**బెటాలియన్ కమాండరు** కబురు అందుకొని **పూనా** హార్స్ **టాంక్** స్క్వాడన్ మేజర్ యస్. బాల్ అతని సిబ్బందితో టాంకులను తీసుకు వచ్చాడు. తెల్లవారేసరికి **టాంకులతో** యుద్ధానికి ముఖాముఖిగా నిలుచోగానే పాకిస్తానీలు తెల్లబోయారు.

టాంకులతో ఘోర యుద్ధం ఐదువందల అడుగుల **దూరంలో** జరిగింది. ఆ ఒక్కరోజు యుద్ధంలో పాకిస్తానీ టాంకులు అన్నీ కాలిపోయాయి.

పాకిస్తాన్ 13 లాన్‌సర్స్‌ని తుత్తునియలుగా చేశారు. 31 కావలరీని కుంటుపరచారు. పాకిస్తాన్ భయంతోను ఆశ్చర్యంతోను తోకలు ముడుచుకుని వీపులు చూపించారు.

టాంకుల సంగ్రామంలో ఇరు పక్షాలకి ప్రాణనష్టం అధికమే అయింది.

**ఈ** యుద్ధంలో భారతమాత మరో బాలచంద్రుడ్ని కోల్పోయింది. సెకెండ్ లెఫ్టినెంట్ అరుణ్ ఆ యుద్ధంలో ప్రాణాలకి తెగించికాదు ప్రాణాలను లెక్కచేయక అతి ఉత్సాహంతో యుద్ధం చేశాడు. ఆరునెలల క్రితమే పూనా 17 హార్స్ రిజమెంటులో చేరాడు. ట్రెయినింగ్ పూర్తి కానేలేదు.

పాలుగారే పసిబుగ్గల అరుణ్ పటాన్ టాంకులపై మృత్యు వర్షాన్ని కురిపించాడు. అతని వాహనానికి నిప్పు అంటుకొంది. ఒకవైపు కాలిపోతూ వుంది.

కాప్టన్ మల్‌హోత్రా రేడియోలో చెప్పాడు. 'ఇంజన్ కంపార్టుమెంటు కాలిపోతూ వుంది నీవు, అక్కడ వున్న సిబ్బంది తక్షణం బయటికి రావాలి' అంటూ హెచ్చరించాడు.

"మేమున్న ఈ స్థలం బాగున్నంతవరకు పోరాడుతూనే వుంటాను" అని జవాబు ఇచ్చాడు. అవే అతని ఆఖరి మాటలు. అతని టాంకు సగానికి పైగా కాలిపోయింది. అలా కాలుతున్న టాంకులో వుండి మరో నాలుగు పటాన్స్‌ని బద్దలు చేశాడు. శత్రువుల బాంబు వచ్చి నేరుగా అరుణ్‌ని బలిగొన్నది. ఆ బాలవీరుడి ప్రాణాలు అనంతంలోకి ఎగిరిపోయాయి.

* * *

జనరల్ మానిక్‌షా సరిహద్దుల్లో వున్న జవానులను చూసి వాండ్లకి ధైర్యం చెప్పుతూ వారు చూపించిన ధైర్య సాహసాలను మెచ్చుకుంటూ ప్రతి స్థావరానికి వెళ్తుండేవాడు. నాయకుని ప్రశంసల**తో** పుత్సాహపూరితులై వెన్నువిరుచుకొని యుద్ధం చేశారు. వాండ్ల ముఖ్య

## నళిని

నాయకుణ్ని ముద్దుగా 'సాబ్ బహదూర్' అని పిలుచుకునే వారు.

అస్సాం బంగ్లాదేశ్ సరిహద్దుల్లో పాకిస్తాన్ సైనికులు యుద్ధం అంటే సిగ్గుపడుతున్నట్లు వారి స్థావరాల్లో సురక్షితంగా వుండి కాల్పులు జరుపుతున్నారు.

భారత వీరజవానులు బంకర్స్ పైకి వచ్చి తొడలుచరచి ద్వంద యుద్ధానికి సవాలు చేసేవారు. అవతలవారు ఎండ్రకాయలు దూరిపోయినట్లు 'బెంచస్' లోకి దూరిపోయేవారు. ఇండియా సైనికులకి మండిపోయేది. బూతు మాటలతో వారిని రెచ్చగొట్టే ప్రయత్నం చేసేవారు. (**భీముడు** నీళ్లల్లో దాగిన దుర్యోధనుని రెచ్చగొట్టినట్లు) తొడలు చరుస్తూ హే సాలా! హే హరామ్ జాదా! అని పంజాబీలో తిట్టుతూ (పాకిస్తాన్ వారు పంజాబీ భాషనే వాడుతారు) చేతిబాంబులు విసిరేవాళ్లు.

ఆ ధాటికి తట్టుకోలేక దగ్గర వున్న గ్రామంలోకి వెళ్లి దాక్కునేవారు. అట్లాగ్రామ్‌లో అలా పారిపోయి దాక్కున్న పాక్ సైనికుల వెంట బడ్డాడు. గూర్ఖా రైఫిల్స్ రెజిమెంటులో వున్న దిల్ బహదూర్.

శత్రువులు దాక్కున్న బిల్డింగు ముందు కాపలావేశాడు. కాస్సేపటికి ముగ్గురు సైనికులు




బయటికి వచ్చారు. తన చేతి కత్తితో **మొత్తం** ముగ్గుర్ని అంతమొందించాడు. దిల్‌బహదూర్‌కి తృప్తికలుగలేదు. మరికొంతసేపటికి మరో ఇద్దరు వచ్చారు. ముగ్గుర్ని చంపినట్లే ఆ యిద్దర్ని చంపాడు. ఏ శబ్దం రానీయలేదు. **ముందు** వచ్చిన వాళ్ళని వెతుక్కుంటూ వచ్చిన మరి యిద్దర్ని తన కత్తికి ఎరచేసి 'మొత్తం ఏడుగురు' తన లక్కీ నెంబరు అని శాంతించి వెనక్కు మళ్లాడు.

తనను ప్రత్యేకించి చూడవచ్చిన జనరల్ **మానిక్‌షా**కి తన కుర్కీ చూపించాడు. 'శెభాష్' అనిపించుకున్నాడు.

ప్రతి పటాలం యుద్ధంలో తన ప్రత్యేకతను చూపించింది.

కయ్యానికి కాలుదువ్వటం పాకిస్తాన్ ప్రత్యేకత. తలమీద మొట్టి **పూర**కుండచేయడం ఇండియా ప్రత్యేకత.

నింగి — నేలపై యుద్ధం సాగించారు. సాగించుకోలేకపోయారు.

నౌకా యుద్ధం చేద్దాం అన్న ఉబలాటం కలిగింది.

**బుద్ధుడు** గాంధీలు పుట్టిన దేశం. అహింస సహనాలు జీర్ణించుకున్న దేశం. తనకై తాను ఎప్పుడూ ఒకరిమీదికి యుద్ధానికి పోదు.

ఇండియాకి యుద్ధనౌకలున్నాయి. మంచి నావికులున్నారు. 1965**లో** శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రిగారు మన నౌకలు యుద్ధంలో పాల్గొన **కూడదు**, సముద్రతీరాన్ని కాపాడుతూ వ్యాపార అభివృద్ధికి మాత్రమే తోడ్పడాలి అంటూ అప్పటి నేవల్ ఛీఫ్‌కి ఉత్తర్వులు యిచ్చాడు.

అలాటి మన నౌకాదళాన్ని రేపుకున్నారు.

అమెరికా నుంచి బహుమతిగా పొందిన గాజీ విశాఖపట్టణం రేవును ధ్వంసం చేయడానికి యుద్ధం ప్రారంభానికి పదిరోజులు ముందుగానే బయలుదేరింది.

చిటగాంగ్ నుండి నీళ్లల్లో చేపలా దూసుకు వస్తూండినది. 'విక్రాంత్' ఇండియా యుద్ధపు నౌక- గాజీని కనిపెట్టి నావికులు దాని ఆట కట్టించారు. గాజీని నీళ్లల్లో సమాధి చేశారు. బద్దలై మునిగిపోతున్న ఆ గాజీలోంచి హృదయ విదారకమైన అరుపులు ప్రాణభీతితో వారు పెట్టే కేకలు వినలేకపోయారు. శత్రు నౌక మునిగిపోతున్న సంతోషం ఒక ప్రక్క, తోటి మానవులు నీళ్లల్లో మునిగిపోతున్నారని మరోప్రక్క దిగులుతో బాధపడ్డారు, విక్రాంత్‌లో వున్న నావికులు

భారతమాత కన్నబిడ్డలు ప్రాణభీతితో పారిపోలేదు. వెన్ను చూపించలేదు.

కరాచీ నుంచి మంచి పవర్‌ఫుల్ ఫ్రెంచి సబ్‌మెరీన్స్ ఇండియా సముద్రతీరంలోకి వచ్చాయి. వాటిని ఎదుర్కొంది, ఇండియా మరో యుద్ధ నౌక 'కుక్రి'.

కాప్టెన్ మహేంద్రనాథ్ ముల్లా దాని నాయకుడు. దారిలో వుండగానే పాకిస్తాన్ సబ్‌మెరీన్ కుక్రిపై మూడుసార్లు బాంబులు కురిపించింది.

కుక్రి మునిగిపోతూంది. కాప్టెన్ మహేంద్రనాథ్ అదరలేదు, బెదరలేదు. మన నావికులు ప్రాణభీతితో కేకలు వేయలేదు. జయాపజయాలు దైవాధీనం, అది అసహజం అన్నట్లుగా వుండి అతి మనోనిగ్రహం చూపించాడు కాప్టెన్. తన నావికులను లైఫ్ బెల్టుల సహాయంతో అప్పటికప్పుడు ఆ నౌక నుంచి తప్పించి సురక్షిత ప్రదేశానికి పంపేశాడు. అంద**రూ** వెళ్తున్నారు. ఒక నావికుడు లైఫ్ బెల్టు కాప్టెన్‌కి యిచ్చి 'మీరు వెళ్లండి' అని చెప్పాడు.

సనాతన ఆచారప్రకారం కాప్టెన్ నావతోనే వుండాలి. నౌక**తో**టే తన ప్రాణాలు ముడిపెట్టుకుంటున్నాడు. అక్షరాల కాప్టెన్ మహేంద్రనాథ్ ఆ ధర్మాన్ని పాటించాడు.

యుద్ధ నావ నుండి బయటపడిన నావికులు, మెల్లమెల్లగా మునిగిపోయే నావలో డెక్ మీద కుర్చీలో కూర్చున్న తమ ప్రియతమ కాప్టెన్‌ని చూసి జోహార్లు అర్పించారు. భారతదేశ చరిత్రలో ఆ వీరుల గాథలు సువర్ణాక్షరాలతో లిఖింపబడ్డాయి.

తన దేశంకోసమే గాక పొరుగురాజ్య క్షేమం కోసం — ఇండియా నౌకాదళం, విమానదళాల పదాతులు పోరాడుతున్నారు. ప్రాణాలుదీస్తూ ప్రాణాలు పోగొట్టుకుంటూ పోరాటం సాగిస్తున్నారు. జై జవాన్ అంటూ భారత ప్రజలు జేజేలు కొట్టుతున్నారు.

**/ఇంకా వుంది/**

# చెమటకాయల యొక్క దురద, మంట బాధను మరిచి పోండి.

నైసిల్
ఉపయోగించండి.
అతిశీఘ్రంగా
ఉపశమనమునిచ్చే
చెమటకాయల పౌడరు

2 ప్యాక్‌లలో
దొరుకును —
"బ్లూ" మరియు
"శాండల్ వుడ్"

nycil
PRICKLY HEAT
POWDER

**నైసిల్ పొందండి.**
**చెమటకాయలను మరువండి.**
**కేవలం 6 రూపాయల 63 పైసలు.***

*గరిష్ఠ రీటైల్ ధర. స్థానిక పన్నులు అదనం

చెమటకాయల పౌడర్
మాత్రమే మీకు దురదలు, మంటల
చికాకుల నుండి అతి శీఘ్రంగా
ఉపశమనము నిస్తుంది.
ప్రత్యేకమైన ఔషధీయుక్త నైసిల్
చెమటకాయలను ప్రతి దశలోనూ
ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను ఆపుతుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధకారిమైన సూక్ష్మ జీవులను నాశనము చేస్తుంది.
4. శరీరమునకు ఉపశమనము నిస్తుంది.

Sista's-GN-79-364-Tel

'మండే గుండెలు'లో



శోభన్‌బాబు, కృష్ణ

# సి ని మా

## గోరింటాకులో 'గ్యాస్'

ప్రసాద్ స్టూడియోలో యువ చిత్ర వారి "గోరింటాకు" వన్నెల చిత్రాన్ని సమర్పించే కె. వరసింహంనాయుడు కనిపించి, "అక్కడ డబ్బింగ్ థియేటర్‌లో మా పిక్చర్ ప్రొజెక్షన్ జరుగుతోంది. వస్తారా?" అన్నారు. "ఇప్పుడు నుంచి కామెడీ సీను ... నవ్వలేక మీ కడుపు గ్యాస్ నిండినట్లు ఉబ్బిపోతుంది. రండి," అని ఆహ్వానించారు నిర్మాత కె. మురారి.

మొదటిసారి కడుపువస్తే అశ్రద్ధ చెయ్యకూడదని, డాక్టర్ దగ్గరికెళ్లి చూపించి సలహాలు తీసుకోవాలని చెల్లమ్మ (రమాప్రభ)ను బలవంతపెట్టి హాస్పిటల్‌కు తీసుకొచ్చాడు మల్లయ్య (చలం). చెల్లమ్మను పరీక్షించిన డాక్టర్ స్వప్న (సుజాత) అది గర్భంకాదని చెప్పింది. దాంతో చెల్లమ్మ తన పరువు పోయిందంటూ మొగుడ్ని తిడుతూ గగ్గోలుపెట్టసాగింది: "ఒరి సన్నాసీ! నీ మొహం బూడిదైపోనూ ... నువ్వు నాశనమైపోనూ ... నీ జిమ్మడ..."

"యేటయినాదే! యేటయినాది?" మెల్లగా అడిగాడు మల్లయ్య.

"నువ్వేటి మొగుడివి? నా పరువే పోనాది బాబో!"

"యేటయినాదే?"

"యేటుందని యేటవుద్ది? యేటవుద్దని?"

ఇంతలో అక్కడికొచ్చిన రాము (శోభన్‌బాబు) "స్వప్నగారూ! ఏం జరిగింది?" అన్నాడు. "ఆమె గర్భిణికాదు; లోపల గ్యాస్‌ఫార్మ్ అయింది," అని స్వప్న జవాబిచ్చేసరికి "యేటంతరు? గాసా?" అంటూ బుర్ర గోక్కున్నాడు మల్లయ్య.

దాంతో చెల్లమ్మకు కోపం ఆగిందికాదు: 'గానుకాకపోతే యింకేటవుద్ది? సిగ్గయిపోనాది. నా బతుకే సిగ్గయిపోనాది. ఒరే రావుడూ! నానెల్లిపోతున్నాను — నానెల్లిపోతున్నాను. నేనుండను బాబోయ్ — నా బతుకే గానయిపోనాది," అంటూ లబోదిబోమంది.

ఇంకా — ప్రభాకరరెడ్డి, రమణమూర్తి, దేవదాస్, సాక్షి రంగారావు, పి. జె. శర్మ, వంకాయల, సుజాత, వక్కలంక పద్మ, సావిత్రి నటించిన "గోరింటాకు" వన్నెల చిత్రానికి కె. రామలక్ష్మి కథ రాశారు. యు. రాజగోపాల్ ఛాయాగ్రాహకుడు. కె. వి. మహదేవన్ సంగీతం. శిల్పం, కూర్పు, సహకార దర్శకత్వాన్ని తోట, జి. జి. కృష్ణారావు, సి. వి. రమణబాబు నిర్వహించారు. స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం: దాసరి నారాయణరావు.

## సుధా చిత్ర

కె. శంకరరెడ్డి, వి. ఎస్. నాయుడు నిర్మించే వినోదభరిత చిత్రంలో చంద్రమోహన్, మురళీ మోహన్ ప్రభృతులుంటారు. జంధ్యాల రచయిత. భాస్కరరావు ఛాయాగ్రాహకుడు. వి. విద్యాసాగర్ రెడ్డి సహకార దర్శకుడు. చక్రవర్తి సంగీతం. ఎం. ఎస్. కోటారెడ్డి దర్శకత్వం నిర్వహిస్తారు.

## ఉదయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్

కోటారెడ్డి — చక్రవర్తి కాంబినేషన్‌లో తయారయ్యే మరో వన్నెల చిత్రంలో కృష్ణ హీరో. నన్నపనేని సుధాకర్ నిర్మాత.

# సినిమా విశేషాలు -జి. వి. జి.

## "సినిమా పిచ్చోడు"లో సినిమా పిచ్చివాళ్ళు

సినిమా రంగాన్ని గురించి చెప్తూ ఒక కవి 'ఇది హంగుల వల — రంగుల కల' అన్నాడు. తెరమీద కనిపించే చిత్రం వేరు. చిత్రం వెనుక రంగం వేరు. దూరపు కొండలు నునుపు అని భావించే కొందరు — కాస్త కనుముక్కు తీరు బాగుండగానే — ఏ శోభన్‌బాబో, కృష్ణంరాజో అయిపోదామని, అయినకాడికి అప్పో సొప్పో చేసి — లేక ఉన్నది తెగనమ్మి, మద్రాసు రైలెక్కుతారు. అయితే, అదృష్టం అందరినీ అందలం ఎక్కించదు. గమ్యం చేరాలంటే అష్టకష్టాలూ పడాలి. అప్పటికీ చేరగలమనే నమ్మకంలేదు. చేతిలోని డబ్బు ఖర్చయిపోగానే పాండీబజారు పాలవుతారు. చివరికి నిరాశా నిస్పృహలతో భూమి గుండ్రంగా ఉందని నిరూపించడానికి బయలుదేరినచోటుకే చేరుతారు. అలాగే రాంబాబు అనే యువకుడు వచ్చాడు మద్రాసు. హీరో అవుదామని రుచి మాశాడు అవమానాలు, ఆకలిబాధలు. అరిచాయి పేగులు. పడ్డాడు అకస్మాత్తుగా సినీ సర్పద్రష్టల మధ్య. విన్నారతని గోడు వెండితెర భాయీలు. అందుకున్నారు పల్లవి. అయింది కోరస్...

"ఇది హంగుల వలరా భాయీ —
నవ రంగుల కలరా
ఇందులో పడ్డవాడు తేనెలో పడ్డ ఈగరా
ఎందుకొచ్చావురా నాయనా సినిమాఫీల్డుకి
వెనక్కి వెళ్ళే మార్గం తెలియక
మాలో మేమే ఏడుస్తూంటే —
నువ్వెందుకొచ్చావురా నాయనా !"

ప్రకటించారు బోలెడు సానుభూతి. చెప్పకోటం మొదలెట్టారు తమ గోడు...

"హంసల్లాగా వచ్చాము—కాకుల్లాగా మారాము
కాకా మంత్రం నేర్చాము — బాకాలెన్నో
ఊదాము."

సినిమా ఛాన్సు రావాలంటే — పట్టాలి కాకా. ఊదాలి బాకా... లేకపోతే, వేషం కాదుకదా — కనీసం ఆఫీసు ప్రవేశం కూడా దొరకదు. ఏం చేశారిక అంటే...

"అందితే జుట్టు పట్టాము. అందకుంటే
కాళ్ళు పట్టాము.
గుడ్డకు, పుడ్డకు లాటరీ కొడుతూ
వచ్చిన చోటే ఉన్నాము..."

అంతేమరి. సినిమాలో వేషం వేయడంకన్నా స్వర్గానికి నిచ్చెనలు వేయడం తేలిక. ఇంతకీ, సినిమా అంటే ఏమిటి ?

"కట్టూ బొట్టూ జుట్టూ —
కళ్ళూ ఒళ్ళూ పళ్ళూ
అన్నీ ఇక్కడ పెట్టుడు సరుకే
గ్లామర్ మేకప్ తుడిచేవరకే..."

అసలు సినిమాకు ఎలాంటివారు పనికివస్తారు ?

"టాలెంట్ ఇక్కడ పనికేరాదు.
మంచితనానికి చోటేలేదు.
దిన దిన గండం నూరేళ్ళాయుషు
సినిమా అన్నది అంటువ్యాధిరా..."

అంటూ రాంబాబుకు తాము నేర్చుకున్నవి సలహా ఇచ్చారు :

"ఎలాగూ వచ్చావు గనక — చెప్పేది
శ్రద్ధగా విను.
చిరిగిందైనా సిల్కే వెయ్యి.
పెద్దమనుష్యులకు పార్టీలియ్యి.
ఇక్కడివక్కడ — అక్కడివిక్కడ
ఎప్పటికప్పుడు మోసేసెయ్.
కడుపులోన ట్రాజెడీ — ముఖంలోన కామెడీ
దీనికి లేదు రెమిడీ — ఇది విధికీ,
నీకూ వింత కబాడీ !"

"సినిమారంగం భూలోక స్వర్గంగా భావించే వారికి కనువిప్పు కలిగిస్తుంది మా చిత్రం," అన్నారు భారతీ ఆర్ట్స్ పిక్చర్స్ అధినేత టి. రఘునాథరెడ్డి. "కథానాయకుడుగా కొత్త యువకుడ్ని ఎన్నుకున్నాం — అతని పేరు రఘునాథ రెడ్డి," అన్నారు డైరెక్టర్ వై. ఈశ్వరరెడ్డి నవ్వుతూ ఇంకా గీత, జ్యోతి, అత్తిలి లక్ష్మి, జయవాణి, మోదుకూరి సత్యం, యర్నమనేని చంద్రమౌళి, వినోద్‌కుమార్, గరగ, మోహనకృష్ణ, మాలి, జయప్రియ పాల్గొన్నారు. అప్పలాచార్య మాటలేకాక సి. నారాయణరెడ్డితో కలిసి చక్రవర్తి స్వరకల్పనలో పాటలూ రాశారు. సాంకేతికవర్గం : పి. ఎస్. ప్రకాష్, నాయని మహేశ్వరరావు, మోహన్‌జీ — జగన్, పొన్నతోట రఘురాం, ముత్యాల సుబ్బయ్య. ఈ వన్నెల చిత్రం షూటింగ్ పూర్తయింది.



'వేంకటేశ్వర వ్రత మహాత్మ్యం'లో కవిత



'మహాలక్ష్మి'లో వాణిశ్రీ

## "నంతకం చేసి చూడు"

"స్వానుభవమున చెప్పచున్నాను వినుడు," అంటూ హాస్య నటుడు పద్మనాభం, తన పుత్రుడు బి. మురళి దర్శకత్వంలో పై పేరున ఒక చిత్రాన్ని ఆగస్ట్ 20న ప్రారంభించారు. ఈ చిత్రంలో పద్మనాభం "నవకోటి నారాయణ" అనే విశిష్టమైన పాత్రను ధరిస్తున్నారు. వీటూరి రచయిత.



'గోరింటాకు'లో సుజాత

# తప్పక చూడండి!




ఈస్ట్మన్ కలర్

నైజాం: రాజశ్రీ పిక్చర్స
తూ, పాండురంగా ఫిలింస

దర్శకత్వం: నందమూరి రమేష్
నిర్మాత: పి. నారాయణరావు

లక్ష్మీచిత

# సినిమా



'ధర్మ యుద్ధం'లో శ్రీదేవి, రజనీకాంత్

## "వెంకటేశ్వర వ్రత మహాత్మ్యం"లో వేర్వేరుగా జంట పాట చిత్రీకరణ

వాహినీ స్టూడియోలో నరసింహరాజు, కవితలపై వేర్వేరుగా యుగళగానం చిత్రీకరిస్తున్న డైరెక్టర్ కె. ఎస్. ఆర్. దాస్‌ను అలా చిత్రీకరించ డానికి ప్రత్యేకమైన కారణమేమైనా వుందా అని అడిగాను.

''నవయువకుడు నాగరాజా, ఆచార్య రామానందులవారి శిక్షణలో సంగీత నాట్యాలలో ఆరితేరాడు. తన ఊహలతో ఒక సుందరిని సృష్టించుకొని, ఆమె రూపాన్ని పటంగా చిత్రిస్తున్నాడు. అదేవిధంగా మరోవంక ఆ దేశపు రాకుమారి కల్యాణి ఎందరో రాకుమారులను నిరాకరించి, తన ఊహలతో ఒక సుందరాకారుని చిత్రించసాగింది. ఒకరి రూపం ఒకరి కళ్ళబడక ముందే వారి మనస్సులు పరస్పరం సందర్శించు కుంటాయి. ఊహాగానంలో శృంగారగానం చేస్తాయి,'' అన్నారు దాస్.

నాగరాజా : ఓహో! ప్రణయసుందరీ!<br>
శృంగార రాగ రసమంజరీ<br>
కదలి రా మెరుపులా<br>
మధురమై కవితలా!

కల్యాణి : ఓహో! మదనమోహనా!<br>
సంగీత నాట్యమయ జీవనా!<br>
చేరుకో ప్రియతమా!<br>
అందుకో మధురిమా!

''ఇది పౌరాణిక జానపద చిత్రం,'' అన్నారు కృష్ణా క్రియేషన్స్ పతాకంలో ఈ వన్నెల చిత్రాన్ని నిర్మించే జి. సి. కృష్ణంరాజా, జి. రామకృష్ణంరాజులు. కథ, మాటలు పిటూరి రాశారు. ఆయనతోపాటు వేటూరి రాసిన గీతాలకు చక్రవర్తి స్వరకల్పన చేశారు. మధు ఛాయా గ్రాహకుడు. పెండ్యాల వెంకటేశ్వరరావు సహకార దర్శకుడు.

## "కలియుగ రావణాసురుడు"

బాపు దర్శకత్వంలో ఆగస్టు 17 ఉదయం ద్రాక్షారామంలో ప్రారంభమైన శ్రీ రాజలక్ష్మి సినీ ఆర్ట్స్ క్రియేషన్స్ వన్నెల చిత్రానికి పై పేరు పెట్టినట్లు నిర్మాత అంగర సత్యం తెలియజేశారు. ''తొలి షెడ్యూలు సెప్టెంబర్ 2 వరకు వేగాయంపేట, రామచంద్రపురం, కోటిపల్లిరేవు వగైరా ప్రాంతాలలో జరుగుతుంది. అక్టోబర్ 15 నుంచి 31 వరకు జరిగే రెండవ షెడ్యూల్‌తో చిత్రీకరణ పూర్తవుతుంది,'' అని కూడా అన్నారాయన. మురళీమోహన్, శ్రీధర్, శారద, మాధవి, నూతన్‌ప్రసాద్, రావుగోపాలరావు, అల్లురామలింగయ్య, కాకరాల, హలం నటిస్తున్నారు. ముళ్ళపూడి వెంకటరమణ రచయిత. బాలుమహేంద్ర ఛాయాగ్రాహకుడు. మహాదేవన్ సంగీత దర్శకుడు. డి. వెంకటరత్నం సంకలనకర్త. కె. ఎ. లక్ష్మినారాయణ, చక్రవర్తి సహకార దర్శకులు.

'గుప్పెడు మనసు'లో సుజాత, సరిత



# సినిమా



'నిజం'లో మోహిని

## "నిజం" చిత్రంలో అబద్ధాలకోరు

అది సార్వభౌమరావు ఛేంబర్. అందులో ఆయన హితులు, సన్నిహితులు, ఆయనతో అవసరం ఉన్నవాళ్ళూ, కాకారాయుళ్ళూ అంతా కలుస్తారు. అక్కడే తలలు తీయబడతాయి; అతికించబడతాయి. అక్కడ అధికారాలు, ఆశ్రయాలు, ఫేవర్స్ అన్నీ దొరుకుతాయి. సార్వభౌమరావు సమర్థత అలాంటిది. ఆయన స్థాయి అంత ఎత్తయినది.

ఓ రోజు ఉదయం ఎనిమిది గంటలప్పుడు నరసింహారావు తెగ మెరుగుతూ ప్రవేశించాడు: "నిజం నిప్పులాంటిది. నిజాయితీపరుడు నిప్పుతో సమానం—అనే నానుడి మనసా వాచా నమ్ముతున్న వాడ్ని. అంతకుమించి నాకు ఏ అర్హతలూ లేవు ఈ సన్మానాన్ని పొందడానికి... అని—ఓహో! ఏం శలవిచ్చారండీ! అయ్యో, నిజం చెప్పొద్దూ? శ్రీవారికి జరిగిన గజారోహణం, కనకాభిషేకం నా జన్మలో చూడలేదంటే నమ్మండి." సార్వభౌమరావు ఏం తొణక్కుండా కూర్చొమనేసరికి నరసింహారావు మళ్ళీ అందుకున్నాడు: "తమ కాలాన్ని వ్యర్థం చెయ్యలేను. మా అమ్మాయి పి. యు. సి. — ఫ్లయ్యర్ థర్డ్ క్లాస్‌లో పాసయింది. తమరు తల్చుకుంటే అదొక డాక్టర్ అవుతుంది."

"మీ డాటర్‌ను డాక్టర్ చెయ్యాలంటారు... ఇట్ ఈజ్ డన్," అని సార్వభౌమరావు క్షణమాగి, "నరసింహంగారూ! మీరు నాకు హితులు, సన్నిహితులు. అందుకే మీ అమ్మాయి డాక్టర్ అవుతుంది. పోతే—ఒక్క విషయం గుర్తుంచుకోవాలి. స్నేహం స్నేహాన్ని కోరుతుంది. అవసరం వచ్చినప్పుడు ఈ సార్వభౌమరావు ఆ స్నేహాన్ని అడుగుతాడు," అన్నాడు.

"ఆహాహా! చిత్తం. తమ కనుసన్నల్లో మసలుతాను. మీరు కాలితో ఆజ్ఞాపించండి. నెత్తిన పెట్టుకొని పని పూర్తిచేస్తాను," అంటూ నరసింహారావు వినయంగా నిష్క్రమించాక రాధామాధవస్వామి అనే మరో వ్యక్తి వచ్చి, సార్వభౌమరావు కాళ్ళమీద పడిపోయాడు. "క్షమించాలి. తమరు రక్షిస్తానంటేగాని కాళ్ళొదలను," అంటూ తన గోడు ఏకరువు పెట్టుకున్నాడు.

"సరే... వెళ్ళు... నీ కొంప ఏం మునగలేదు లేవయ్యా!" అన్నాడు సార్వభౌమరావు.

"అయ్యా, నేనూ నా పెళ్ళాం మీకు జీవితాంతం ఋణపడి ఉంటాం," అన్నాడు రాధామాధవస్వామి.

"ఏమిటీ?"

"జన్మజన్మలకూ మీ సాయం మరవలేము సార్!"

"ఆ విషయం బాగా గుర్తుంచుకో. ఆ అవకాశం బహుశా ఈ జన్మలోనే రావచ్చు. ఇక వెళ్ళవచ్చు."

దేవదాస్ దర్శకత్వంలో ఎం. సురేంద్రరెడ్డి, పి. విద్యాసాగర్‌రావు నిర్మించిన "నిజం" చిత్రంలో గుమ్మడి (సార్వభౌమరావు), నారాయణరావు, హేమాచౌదరి, రాంబాబు, చెక్కాం, మోహిని, సీమ పాత్రధారులు. జంధ్యాల సంభాషణలకర్త. రాఘవులు సంగీత దర్శకుడు.

'సన్నాయి అప్పన్న'లో జయప్రద, శోభన్





'మంగళ తోరణాలు'లో

## సినిమా

### సెప్టెంబర్‌లో "గుప్పెడు మనసు"

కె. బాలచందర్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ''గుప్పెడు మనసు'' చిత్రం సెప్టెంబర్ రెండవ వారంలో విడుదలవుతుంది. గణేష్‌పాత్రో రచయిత. ఆత్రేయ గీతాలకు ఎం. ఎస్. విశ్వనాధన్ బాణీలు కూర్చారు. బి. ఎస్. లోకనాథ్ ఛాయాగ్రాహకుడు. శరత్‌బాబు — సుజాత, నారాయణరావు — సరిత, రమణమూర్తి, కాకినాడ శ్యామల పాత్రధారులు.



ఒక దృశ్యం

పాత్రధారులు. వేటూరి గీతాలకు జె. వి. రాఘవులు బాణీలు కూర్చారు. కె. ఎస్. మణి ఛాయ, భాస్కరరాజు శిల్పం, జి. జి. కృష్ణారావు కూర్పు, నందం హరిశ్చంద్రరావు సహకార దర్శకత్వం వగైరా సాంకేతికవర్గం. వడ్డే రమేష్ నిర్వహణలో వడ్డే శోభనాద్రి నిర్మాత.

## సురేష్ చిత్రాలు

"మండే గుండెలు" చిత్రం అనంతరం గుహనాథన్ దర్శకత్వంలో రామానాయుడు రూపొందించే సురేష్ ప్రొడక్షన్స్ వన్నెల చిత్రంలో శోభన్ బాబు, మురళీమోహన్, జయసుధ, శ్రీదేవి నటించే విషయం పాఠకులకు లోగడ తెలియజేశాను. సురేష్ మూవీస్ 8 వ చిత్రాన్ని నాగేశ్వరరావు, జయప్రద నాయకీ నాయకులుగా కె. బాపయ్య దర్శకత్వంలో డి. రామానాయుడు నిర్మిస్తారు. సురేష్ ఎంటర్‌ప్రైసెస్ పతాకంలో "దేవుడు నాస్తికుడయ్యాడు" అనే వన్నెల చిత్రాన్ని బోయిన సుబ్బారావు దర్శకత్వంలో డి. సురేష్‌బాబు నిర్మిస్తారు. ఇందులో కృష్ణ హీరో. విజయా సురేష్ కంబైన్స్ బేనర్‌లో "అగ్నిపూలు" వన్నెల చిత్రాన్ని కృష్ణంరాజు, జయసుధలతో కె. బాపయ్య దర్శకత్వంలో డి. రామానాయుడు నిర్మిస్తారు.

## "మూగకు మాటొస్తే?"

వి. మధుసూదనరావు దర్శకత్వంలో ఆగస్ట్ 1న ప్రారంభించిన శ్రీ శివకామేశ్వరీ పిక్చర్స్ వన్నెల చిత్రానికి పై పేరు పెట్టినట్లు నిర్మాత విజయకుమార్ అన్నారు. మూగమ్మాయిగా నటించే జయసుధతో మురళీమోహన్, శ్రీధర్, ప్రసాద్‌బాబు, కె. వి. చలం, మాడా, కవిత, ఎస్. వరలక్ష్మి, రమాప్రభ, జయమాలిని పాల్గొంటున్నారు. బొల్లిముంత శివరామకృష్ణ రచన, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. ప్రసాద్ ఛాయ, డి. వెంకటరత్నం కూర్పు, ఆర్. శ్రీనివాసరావు సహకార దర్శకత్వం నిర్వహిస్తున్నారు.



'మావారి దేవత'లో ప్రభ, రంగనాథ్

## రంగూన్ రౌడిలో సిలోన్ రౌడి

గోపాలరావు నడుపుతున్న అమ్యూస్‌మెంట్ పార్కును సిలోన్ రౌడీ ప్రతిరోజూ వచ్చి దోచుకుపోతున్నాడు. గోపాలరావు (రావుగోపాలరావు) మౌనంగా ఊరుకోవడం భరించలేక ఆయన కుడిభుజం అయిన పంతులు (రావికొండలరావు) "అయ్యా, ఒకసారి అయిపోయింది. రెండోసారి అయిపోయింది. ఇప్పుడు వాడు రావడం మూడోసారి. మనం పట్టి వెధవలమని తెలుసుకున్నాడు. ఇంకో రెండుసార్లు వచ్చాడనుకోండి. ఈ అమ్యూస్‌మెంట్ పార్కు – జూదానికి పనికిరాదు; శవాల్ని తగలెట్టడానికే పనికొస్తుంది. అంచేత, అయ్యా, తమరేమీ ఆలోచించకుండా యూస్ యువర్ గుడ్ ఆఫీసర్స్ ... ఐ. జీ., లెవెల్లో హైదరాబాదుకో ఫోను కొట్టండి," అన్నాడు.

గోపాలరావు నవ్వి, "కొట్టొచ్చు. కాని పంతులూ, హైదరాబాద్ లెవెల్లో ట్రై చేస్తే, మనల్ని ఢిల్లీ లెవెల్లో మూసేస్తారు ... ఒక్క విషయం గుర్తుపెట్టుకో. పొయ్యీ మనదే, కట్టెలూ మనవే, నిప్పూ మనదేకదా అని పొయ్యిలో చెయ్యి పెడితే ఏమవుతుంది?" అన్నాడు.

"కాలుతుంది."

"అంచేత, పట్టకారులో నిప్పుని పట్టుకోవాలి. చూద్దాం – పట్టకారు దొరక్కపోతుందా?"

దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో వడ్డే కిశోర్ సమర్పించే విజయమాధవి పిక్చర్స్ వన్నెల చిత్రం "రంగూన్ రౌడీ"లో కృష్ణంరాజు, జయప్రద, మోహన్‌బాబు, దీప, ప్రభాకరరెడ్డి, సావిత్రి ముఖ్య

'కోతల రాయుడు'లో ఒక దృశ్యం



కృష్ణ, జయప్రద, సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, అల్లురామలింగయ్య, పి. ఎల్. నారాయణ, రమాప్రభ, జి. నిర్మల పాల్గొనే స్టార్స్ ఇంటర్నేషనల్ వారి వర్ణ చిత్రానికి ఎం. బాలకృష్ణ, బి. కాప్ నిర్మాత. జంధ్యాల సంభాషణలు, రాజన్ — నాగేంద్ర సంగీతం, ఎస్. కృష్ణారావు శిల్పం, ఎస్. ఎ. తార ఛాయాగ్రహణం వగైరా సాంకేతికవర్గం.

## శ్రీ గౌరి కంబైన్స్

సరిదె భావనారాయణ నేతృత్వంలో ఆయన పుత్రులు ఎస్. కుమారస్వామి, ఎస్. లక్ష్మీకాంత్ నిర్మించే "పెద్దల వియ్యాలు—పిల్లల కయ్యాలు" వన్నెల చిత్రానికి కోటారెడ్డి దర్శకుడు.

## త్రిమూర్తి ప్రొడక్షన్స్ ఆరో చిత్రం

"ఇది విభిన్నమైన క్రయిమ్ చిత్రం. క్రయిమ్‌తోపాటు చక్కని ఫామిలీ సెంటిమెంట్ గల ఇతివృత్తం," అన్నారు నిర్మాతలు జి సాంబశివ రావు, పి. బాబ్జి. ఆగస్ట్ 17న కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో వీరు నిర్మించే వన్నెల చిత్రం ప్రారంభమైంది. కృష్ణ, శ్రీదేవి, సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, గిరిబాబు అల్లు రామలింగయ్య, త్యాగరాజు, మిక్కిలినేని, అంజలీదేవి, జయమాలిని, సువర్ణ పాల్గొంటున్నారు. భమిడిపాటి సంభాషణల కర్త. సత్యం స్వరకల్పనలో సి. నా. రె., ఆరుద్ర, వేటూరి, గోపి గీతాలు రాశారు. పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రాహకుడు. శిల్పం, కూర్పులను ఎస్. కృష్ణారావు, ప్రకాశం వెంకటరత్నం నిర్వహిస్తున్నారు. డిసెంబర్ విడుదల.

'కాళరాత్రి'లో ఈశ్వరరావు, రమాప్రభ

# సినిమా

## డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ చిత్రం

"మా కొత్త చిత్రానికి ప్రస్తుతం పేపర్ వర్క్ జరుగుతోంది. అక్టోబర్‌లో షూటింగ్ ప్రారంభమవుతుంది," అని తెలియజేశారు నిర్మాత డి. వి. ఎస్. రాజు. కె. విశ్వనాథ్ దర్శకత్వం వహించే ఈ వన్నెల చిత్రంలో కృష్ణంరాజు, జయసుధ నాయకా నాయికలు.

## డైరెక్టర్ వి. సాంబశివరావు కొత్త చిత్రాలు

సత్యనారాయణ, సూర్యనారాయణ నిర్మించే సత్య చిత్ర వారి తాజా చిత్రంలో కృష్ణ, జయప్రద నాయకా నాయికలు. రచన : ముళ్ళపూడి వెంకటరమణ. సంగీతం : మహదేవన్. ఛాయ : వి. ఎస్. ఆర్. స్వామి.





"శాంతి లాంటి ఆడదాన్ని పెళ్ళి చేసుకోవటం కంటే జీవితాంతం బ్రహ్మచారిగా వుండటం బెటర్రా ... కృష్ణా!" శంకరం కంఠం తీవ్రంగా వుంది

మేడ ఆఖరి మెట్టు ఎక్కి గుమ్మం ముందు నిలబడి హుషారుగా తలుపు తట్టబోయిన బలరామ్ చెయ్యి అప్రయత్నంగానే ఆగిపొయ్యింది.

"శాంతి" గురించి ప్రస్తావన వినిపించటంతో బలరామ్ కనుబొమలు ముడిపడ్డాయి. మిత్రులు ఇంకా ఏం చెప్పుకుంటారో అన్న ఉత్సుకతతో గుమ్మం దగ్గర నిశ్శబ్దంగా వుండిపొయ్యాడు.

గది లోపల్నుంచి శంకరం గొంతు తీవ్రంగా నిరసన ధ్వని చేస్తూ పలుకుతోంది.

"అది శాంతి కాదురా! అశాంతి. మన బలరామే కాదు ... అసలు ఆ పిల్లని చేసుకున్న ఏ మగవాడు సుఖపడలేడు!"

"నిజమా!?" మంచం మీద కూర్చున్న కృష్ణకుమార్ కుతూహలంగా అడిగాడు.

పేలవంగా నవ్వాడు శంకర్.

"ఒరేయ్ కుమార్! నాకూ అక్కచెల్లెళ్ళు వున్నారు. ఒక పరాయి ఆడపిల్ల గురించి అబద్ధాలు చెప్పాల్సిన అగత్యం నాకేమిటి? మన బలరామ్ లాగే నేనూ ఒకప్పుడు శాంతి గురించి వున్నతంగా వూహించుకున్నాను. ఆరాధించాను. కలలు కన్నాను. మా కులం కాకపోయినా పెద్దల్ని ఎదిరించి అయినా సరే పెళ్ళి చేసుకుందామని నిర్ణయించుకున్నాను. కాని..."

శంకరం గొంతులో జీర! నిట్టూర్పుని అణచుకుంటున్నట్లుగా దిగులు వ్యక్తంచేస్తూ అతని మాటలు ఆగిపొయ్యాయి.

"ఏమైంది శంకర్?" కృష్ణకుమార్ అడిగాడు

శంకరం నిట్టూర్చాడు.

"అవటానికి ఏముంది కుమార్? స్వేచ్ఛగా ఎగిరే పిట్టని పంజరంలో బంధిస్తే గిజగిజ మంటుంది. విచ్చలవిడితనానికి అలవాటుపడిన శాంతి లాంటి ఆడపిల్లలు కూడా అంతే! శాంతి ప్రేమకే కాని పెళ్ళికి పనికిరాదు..." శంకర్ గొంతులో కసి ధ్వనించింది.

"అంటే!?" కృష్ణ విస్తుపోతూ చూశాడు.

"అంటే ఏముందిరా? శాంతికి నేను ఒక్కడ్నే ప్రియుడ్ని కాదు. చాలా మందితో అటువంటి వ్యవహారాలు వున్నాయని తెలిసింది. శాంతిని చూశావుగా! సీతాకోకచిలుకలా రోజుకో సింగారం! వాళ్ళది మధ్యతరగతి కుటుంబం. అసలు హాస్టల్‌లో వుండి చదువుకునే స్తోమతు లేదు. అయినా ఆమెగారికి అంత డబ్బు ఎక్కడి దంటావ్?"

కృష్ణకుమార్ సందేహంగా రెప్పలు కదిలించాడు.

"వాళ్ళ తల్లిదండ్రులకి ఆమె ఒక్కర్తే సంతానం అని విన్నాను..."

"ఆఁ..." నిర్లక్ష్యంగా గాల్లోకి చెయ్యి విసిరాడు శంకర్.

"నేనూ మా నాన్నకి ఒక్కడ్నే! మా నాన్న పెద్ద భూకామందు. అయితే ఏం? ఒక్క వందరూపాయిలు ఎక్కువ అడిగితే లక్ష ఆరాలు తీస్తాడు. డబ్బు వుంది కదా అని ఎవ్వరూ రోడ్డు మీద జల్లుకోరు 'శాంతి' తాను చేసే తప్పుడు పన్లు కప్పిపుచ్చుకోవటం కోసం అందంగా చెప్పే అబద్ధాలు అవన్నీ! శాంతి దుర్వర్తన చాలాసార్లు నా కళ్ళారా చూశాను. ఖరీదయిన షావుకార్ల కార్లల్లో తిరుగుతుంది. వాళ్ళ బిల్డింగ్సుకి వెడుతుంది. ఇవన్నీ తెల్సిన తరువాతే ఆమెని పెళ్లి చేసుకోవాలన్న నిర్ణయాన్ని మార్చుకున్నాను. ఆ విధంగా మా మధ్య అభిప్రాయబేధాలు వచ్చాయ్. మా ఇద్దరిమధ్య క్రమంగా దూరం పెరిగింది!..." చెప్పటం ఆపి శంకర్ వూపిరి తీసుకున్నాడు!

చాటుగా వుండి అంతా వింటున్న బలరామ్‌కి వూపిరి నిల్చినట్లు అయ్యింది. క్రోధంతో పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

"మరి... మరి. ఈ విషయం బలరామ్‌కి తెలియదంటావా?" కృష్ణకుమార్ సందేహంగా అడిగాడు.

వేదాంత ధోరణిలో నవ్వాడు శంకర్.

"ఫూల్! తెలిస్తే బలరామే కాదు ... అసలు ఏ మగవాడు చేసుకుంటాడురా అట్లాంటి దాన్ని?..."

"నిజమే శంకర్! బలరామ్ నీకు మంచి ఫ్రెండు. పోని నువ్వు చెప్పచ్చుగా?"

"ఉహుఁ... చెప్పను. అది చాలా తప్పు. కుమార్ ... ఎట్టి పరిస్థితుల్లోనూ నువ్వు కూడా అతనికి ఈ విషయాలు చెప్పద్దు. మనిద్దరిమధ్యే వుండాలి. వెయ్యి అబద్ధాలు చెప్పి అయినా ఒక పెళ్లి చెయ్యమన్నారు పెద్దలు! మనం పెళ్లి చెయ్యలేకపోయినా చెడగొట్టటం మాత్రం చెయ్యొద్దు! అయినా ఎవరి ఖర్మకి ఎవరు కర్తలు? బలరామ్ అదృష్టం యెలా వుంటె అలా జరుగుతుంది. అయినా ఇవన్నీ పాత

సంగతులు. ఇప్పుడు ఆమె మారిందేమో. ఎవరికి తెలుసు ? ... లేదూ...''

తలుపు చాటుగా వున్న బలరామ్‌కి కాళ్ళ క్రింద భూమి కదిలినట్లు అయ్యింది. అప్రయత్నంగానే అతడి చెయ్యి గుండెల మీదికి వెళ్ళింది. ఒక్క క్షణం వూపిరి నిల్చిపోయినట్లు ప్రాణం గిజగిజ మంది.

లోపల్నుంచి శంకర్ గొంతు ఏవో నచ్చచెప్తున్నట్లు వినిపిస్తూనేవుంది.

కాని బలరామ్‌కి అవేమి వినిపించటంలేదు. కళ్ళముందు అంతా చీకటి తెరలు. ఇంక అక్కడ ఒక్కక్షణం నిలవలేకపోయ్యాడు.

అంతే!

ఒక్క ఉదటన రోడ్డుమీదకి వచ్చేశాడు. అతని నుదురంతా సన్నని చిరుచెమటలు కమ్ముకున్నాయ్. మనిషి ఆపాద మస్తకం కంపించ సాగాడు.

పొడవుగా వున్న ఆ రోడ్డంతా దాటి జనసందోహాన్ని తప్పించుకుని రూమ్‌కి ఎలా వచ్చి పడ్డాడో... అతనికే తెలియదు.

వంటిమీద స్పృహ లేనట్లు మంచంలో బోర్లాపడి దిండులో తల దాచుకున్నాడు!

ఆడపిల్లకంటే అన్యాయంగా అతడి కళ్ళు ముక్కలు ముక్కలుగా కన్నీటిని కురిపిస్తున్నాయ్!...

''... ... తను ఏం విన్నాడు? తన ప్రేమ... ... శాంతితో జరగబోయే తన పెళ్ళి గురించి ఎన్ని కలలు కన్నాడు? నిజంగా శాంతి అలాంటిదా? తనని ఎందుకింత మోసం చేసింది? అమాయకంగా ఆరాధించినందుకు ఈ పూర్ బలరామ్‌కి ఆమె ఇచ్చే ప్రతిఫలం ఇదేనా? ఆమెకి తను ఏం ద్రోహం చేశాడని? ఇలా ఎంతమందిని మోసగిస్తుంది? శంకర్‌కి అబద్ధం చెప్పాల్సిన అగత్యం ఏమిటి? శంకర్‌కి దురలవాట్లు వున్న మాట నిజమే. కలిగిన ఇంట పుట్టిన ఏకైక పుత్రుడు కావటంచేత డబ్బు ఎక్కువై వ్యసనాలు అలవడ్డాయి. కాని అతడు వ్యక్తిగతంగా చాలా మంచివాడు. మంచిమనసు వున్నవాడు. కాగా తనకి ఆత్మీయుడు! అబద్ధాలు ఎందుకు చెప్తాడు. శంకర్ కృష్ణకుమార్‌కి కాక తనకే చెప్పివుంటే తాను ఎంతో సంతోషించి వుండేవాడు! ఆ క్షణంలో బాధ అనిపించినా జీవితాంతం కుమిలిపోయేకంటే ఇది ఎంతో నయం! శాంతి నిజంగా అట్లాంటిదే అయివుంటుంది. అటువంటి అమ్మాయినా తాను ప్రేమించింది? పెళ్ళి చేసుకోవాలని తాపత్రయ పడింది. చివరికి ఆ ప్రేమ... ఆ నమ్రత... అంతా నటన అన్నమాట! ఇలా ఎందరితో... ఛీ... ఛీ...'' అశాంతితో తల పట్టుకున్నాడు బలరామ్.

ఆ మర్నాటినుంచి కాలేజికి శెలవులు. స్టూడెంట్సు అంతా వూళ్ళకి ప్రయాణం అవుతున్నారు. కాని బలరామ్ శాంతి కోసం ఇంకా కొన్ని రోజులు వుండాలి అనుకున్నాడు. ఒక వారం పది రోజుల్లో శాంతిని స్థానికంగా వున్న గుళ్ళో పెళ్ళి చేసుకుని భార్యతోసహా తల్లితండ్రులకి కనుపించాలి అనుకున్నాడు! రెండు రోజులుగా ఆ ఏర్పాట్లతోనే సతమతం అవుతున్నాడు. కాని... ఇప్పుడు ఇంక ఆ అవసరం ఏమిటి?

బలరామ్‌కి పెద్ద ''గండం'' తప్పిపోయినట్లు హృదయం తేలికగ అనిపించింది.

ఇంక అక్కడ ఒక్క క్షణం వుండటానికి కూడా మనసు అంగీకరించలేదు.

బలరామ్ ఆ రాత్రికే ఊరికి ప్రయాణం అయ్యాడు.

వెళ్ళేముందు శాంతి పేరున ఒక ఉత్తరం వ్రాసి పోస్ట్‌లో వేసి మరీ రైలు ఎక్కాడు.

* * *

సరిగ్గా నెల్లాళ్ళ తరువాత ''శాంతి''

'భలే కృష్ణుడు' లో కృష్ణ, సంగీత



# హార్లిక్స్



## ఆరోజుకు ఆరోజు రోగనివారణ శక్తిని పెంచి ఆరోగ్యాన్ని కాపాడే పౌష్టికాహారం.

హార్లిక్స్ నిత్యం సేవించినట్లయితే, మీ కుటుంబానికి రోగాలు రాకుండాతట్టుకునే శక్తి పెరుగుతుంది. వారికి సంపూర్ణమయిన ఆరోగ్యం చేకురుతుంది. ఆరోగ్యం మహాభాగ్యం.

హార్లిక్స్, ప్రపంచం అంతటా డాక్టర్లు సిఫార్సు చేసేది ఇది ఒక్కటే. మీకు అత్యధికంగా పుష్టి ఇచ్చేది ఇది ఒక్కటే ఎందుచేతనంటే ఇందులోను సంపన్నమయిన స్వచ్ఛమయిన పదార్థలు, అపూర్వమయిన హార్లిక్స్ పద్ధతి ప్రకారం సమ్మిళితమితాయి. దీనివల్ల వీటి సహజ సద్గుణాలు నష్టంకావు. అవి సులువుగా జీర్ణం అవుతాయి.
అందువల్లనే సుచిత్ర హార్లిక్స్‌ని తన కుటుంబ జీవితంలో భాగంగా చేసుకుంది.

సుచిత్ర మోస్తరుగానే మీరుకూడా మీకుటుంబానికి ప్రతిరోజు హార్లిక్స్ ఇవ్వండి వారు ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

"హార్లిక్స్ ప్రధానమయిన పుష్టి సాధనం. మీకుటుంబంలోనివారికి వ్యాధులు రాకుండా తట్టుకునే శక్తి పెరిగేందుకూ వారు ఆరోజుకారోజు ఆరోగ్యంగా, చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను సిఫారుసు చేస్తున్నాను"



**హార్లిక్స్ మంచి పుష్టికరమైనది**

హార్లిక్స్ రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్.

Hx1648. TAL-1

దగ్గర్నుంచి బలరామ్‌కి ఒక ఉత్తరం, దాంతోపాటు ఆమె పెళ్ళి శుభలేఖ అందాయ్.

బలరామ్ మొఖంలోకి ఒక్కసారిగా ఆవేశం వెల్లువలా పొంగింది.

అప్రయత్నంగానే అతని చేతులు ఉత్తరాన్ని విప్పాయి...

* * *

శ్రీ బలరామ్‌గారికి ...

మీరు వ్రాసిన ఉత్తరం అందినది. మన ప్రేమ విఫలం అయినందుకు నేను పెద్దగా బాధపడటంలేదు. మీరు నన్ను గుడ్డిగా ప్రేమించి మోసపోయానని వ్రాశారు. శంకర్ నా గురించి కృష్ణకుమార్‌తో చాలా అసహ్యంగా చెప్తుంటే విని మీ నిర్ణయం మార్చుకున్నారని వ్రాశారు, సంతోషం.

కాని బలరామ్‌గారూ ...

శంకర్ చెప్పగానో, మరో ఈశ్వర్ చెప్పగానో మన అభిప్రాయాల్ని క్షణాలమీద మార్చుకోవటం సమంజసం కాదేమో!

ప్రతి మనిషికి ఒక స్థిరమైన వ్యక్తిత్వం వుండాలి. మంచి చెడులు బేరీజు వెయ్యగల స్తోమతు వుండాలి. మనమిద్దరం రెండేళ్ళుగా కలిసి చదువుకున్నాం. మన ఇద్దరి మధ్య మంచి స్నేహాన్ని మించిన సన్నిహితత్వం ఏర్పడింది. ఈ రెండేళ్ళలో మీరు నా గురించి తెల్సుకున్నది ఏమిటి? నన్ను అర్థంచేసుకున్నది ఏమిటి? ఎవరో ఏదో చెప్తే ఎలాగ నా గురించి మీరు నమ్మారు? మీకంటూ నా మీద అసలు ఓ అభిప్రాయం ఏర్పడలేదా? నేనంటే ఏమిటో తెలియలేదా? అయితే... నిజంగా మీది గుడ్డి ప్రేమే!...

మనకి ఏవిధంగానూ పరిచయంలేని, తెలియని వ్యక్తి గురించి ఎవరైనా ఏదైనా చెప్తే

# గుడ్డి ప్రేమ

నమ్మటంలో అర్థం వుంది. కాని పూర్తిగా తెల్సిన వ్యక్తి గురించి నమ్మటం ఎంత అవివేకమో కాస్త ఆలోచించండి. ఈ రెండేళ్ళలో మీ సమక్షంలో నా ప్రవర్తన గురించి పునరాలోచన చెయ్యండి. శంకర్ చెప్తే నమ్మటంకాదు. మీకంటూ నామీద ఏ విధమైన సదభిప్రాయం కలగకుండానే నన్ను గుడ్డిగా ప్రేమించి పెళ్ళి చేసుకుందుకు సిద్ధపడ్డారు అనుకుంటే నా మనసులో మీ గురించి ఎంత నిరసన భావం ఏర్పడిందో మాటల్లో చెప్పలేను. ఇటువంటి వ్యక్తిత్వం గల మిమ్మల్ని పెళ్ళి చేసుకున్న ఏ ఆడది బహుశా జీవితంలో సుఖపడలేదు. మీలాంటి గుడ్డి ప్రేమికుని పెళ్ళి చేసుకుని జీవితాంతం అవమానాలపాలు అయ్యేకంటే మనలాంటి ప్రేమికులు విడిపోవటమే శ్రేయస్కరం.

ఇక శంకర్ నా గురించి అలా ఎందుకు చెప్పావచ్చిందని మీరు అంటారేమో! ఒకప్పుడు... అంటే మీరు మన కాలేజికి రాకపూర్వం శంకర్ నాకోసం చాలా ప్రయత్నించాడు. శంకర్ వ్యసనపరుడు. డబ్బు వుందన్న "అహం" కలవాడు. అతడంటే నాకు ముందు నుంచి ద్వేషం! కనిపించిన ప్రతి ఆడపిల్లకి ప్రేమలేఖలు రాసే మనస్తత్వం అతనిది. నేనేకాదు... నీతి, నిజాయితి వున్న ఏ ఆడపిల్ల అటువంటి వ్యక్తిని కోరుకోదు. నేను అతని ప్రేమని తిరస్కరించటమే కాదు... ఒకరోజు చెప్పతో బాగా సత్కారం చేశాను. అప్పట్నుంచి అతడికి నామీద ద్వేషం. నేను జీవితాంతం ఏడ్చేలా చేస్తానని ఆరోజు సవాల్ చేశాడు. నేను పట్టించుకోలేదు. కాని క్రమంగా అతను నా జోలికి రావటం మానివేశాడు. నేను ప్రక్కనించి పోతున్నా పట్టనట్లు తలతిప్పుకుని వెళ్ళిపోయేవాడు. "ఇప్పటి కయినా బుద్ధితెచ్చుకున్నాడు, అతనిలో మానవత్వం మేల్కొనివుంటుంది... ఎంతైనా చదువుకుంటున్నాడు కదా! ఆపాటి సంస్కారం అలవడి వుంటుంది" అని సంతోషించాను. కాని... కాలనాగు పొంచివుండి కాటువేస్తుందని అనుకోలేదు కోరలు పీకిన పాము అయినా "బుస" కొడుతుందన్న విషయం గ్రహించకపోవటం నాదే పొరపాటు.

పోనీలెండి. జరిగిపోయినదాని గురించి నాకు బాధలేదు. నా గురించి శంకర్ చెడుగా చెప్పాడని, ప్రచారం చేస్తున్నాడని కాదు. కాని "మీరు నమ్మారు" అన్నదే నా బాధ. ఒకోసారి మన కళ్ళు, మన చెవులే మనని మోసం చేస్తాయి. ఓర్పుతో నిజం నిలకడమీద తెల్సుకోవాలి!...

రేపు మీకు వివాహం జరుగుతుంది. మీ భార్య విషయంలో అయినా కాస్త ముందు వెనుక నిదానంగా ఆలోచించటం నేర్చుకోండి. ఎవరో చెప్తే నమ్మటంకాక మీకుగా ఒక అభిప్రాయం ఏర్పరచుకోండి. గుడ్డివాడు ఎలాగూ గుడ్డివాడే కాని కళ్ళుండి గుడ్డిగా ప్రవర్తించటం అవివేకం. ఒక స్నేహితురాలిగా నేను మీకు యిచ్చే సలహా ఇదే!

శెలవ్.

శాంతి."

చేతుల్లో ఉత్తరాన్ని పట్టుకుని అట్లాగే స్థాణువులా వుండిపొయ్యాడు బలరామ్.

శాంతి, బలరామ్‌ల పెళ్ళి చెడిపొయ్యాక, తన ప్రతాపానికి పొంగిపోతూ చాలారోజులు శంకర్ మీసం మెలివేస్తూ్త ఠీవిగా రోడ్ల వెంట తిరిగిన విషయం పాపం బలరామ్‌కి నేటివరకు తెలియదు!

## నా వలపు

వెన్నెలలో ఏదో రూపం
నన్ను పిలిచి కవ్విస్తున్నది!
చంద్రునిలో ఏదో తాపం
వెన్నెలవలె ఎగసిపడుతోంది.
ఆ రూపం చంద్రునిదై
ఆ తాపం వెన్నెలయై
నా హృదయాన్ని కదిలిస్తున్నవి,
నవకవిత నాకందిస్తున్నవి.
ఆ కవితే నా వలపై
చందమామ నల్లుకుంటే
అందని మామను తలచి
నా హృదయం ముక్కలయింది.
ఆ ముక్కలే ఆకాశపథంలో
చుక్కలై,
వీడని ఆశ గుండెల్లో
మినుకు మినుకుమంటూ
జాబిల్లివైపు చూస్తూనేవున్నాయి!
ఆ వెన్నెల రథం వెనుక
పరుగులిడుతూనేవున్నాయి.

\- సుధ



# డాక్టరు సలహాలు

## డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

టి. యస్. ఆర్ - కోడూరు

నాకు తొడల మీద నల్లని మచ్చలు ఏర్పడినవి. ఇప్పటివరకూ విటమిన్ సి మాత్రలు వాడుతున్నాను. ఫలితము కన్పించుటలేదు. దురదగా ఉంటుంది. దీనికి ఏమి మందులు వాడాలి?

నల్లమచ్చలు, దురదలు వుండటానికి సి విటమిన్ మాత్రమే వాడటానికి సంబంధం లేదు.

ఈ మచ్చలు, దురదలు రావటానికి కారణం టినియా క్రూరిస్ అనే ఫంగస్.

దీనికి గ్రైసోవిన్ మాత్రలు రోజుకి 6 వంతున 10 రోజులు లోపలికి తీసుకోవటం, పైపూతగా కెలాగ్— ఎస్ ఆయింట్‌మెంట్ వాడటం, సబ్బు వాడటం మాని, శీకాయపొడి లేక పెసరపిండి వాడటం మంచిది. డ్రాయర్లని వీటిలో మరిగించి, ఉతికి వాడటంవల్ల తిరిగి ఈ జబ్బురాదు.

సి. యస్. ఆర్ - [illegible]

నా వయస్సు 20 సం.లు. 2 సం.ల నుండి ఆకలి అయినప్పుడు కొంచెముగూడ ఆహారం తీసుకోలేక పోతున్నాను. బలవంతంగా తింటే వెంటనే వాంతి అయిపోతోంది. దీనికి ఏమి చెయ్యమంటారు?

కడుపు అనే జీర్ణకోశంలో కురుపులు లేక పుండ్లు [అల్సర్] ఏర్పడిన తర్వాత ఆ చోట్లలో ఏర్పడే మార్పులవల్ల ఆహారం పయనించే ప్రవాహమార్గపు రోధం ఏర్పడటంవల్ల ఆహారం సరిగ్గా క్రిందికిపోదు. కడుపు ఉబ్బరంగా ఉంటుంది. వాంతులవస్తాయి.

అదే సమయంలో కడుపులో ఉదజనిహరికామ్లం యొక్క పరిమాణం ఎక్కువయి, మంట లేక ఛాతీ క్రింది భాగంలో నొప్పి రావటం సహజం.

ఇలా ఉన్నవారికి ఆ మంటవల్ల ఆకలివేసినా, కడుపు పైన ఖాళీ అవక పోవటంవల్ల ఆహారం తీసుకోవటం కష్టమవుతుంది. ఇటువంటి వారికి మందులు ఎక్కువగా పనిచెయ్యవు. శస్త్రచికిత్స శ్రేయస్కరం.

జి. యస్ - ఖమ్మం

నా వయస్సు 30 సం.లు. నా మెడ ఎడమవైపు చిన్న, చిన్న బిళ్లలు ఉన్నవి. గత రెండు సంవత్సరములుగా ఆ భాగమంతా నొప్పిగా ఉన్నది. మాత్రలు, ఇంజక్షన్లు వాడాను. ఫలితము కన్పించలేదు. ఇవి రావటానికి గల కారణము, వైద్యము తెల్పండి.

మెడమీద బిళ్లలు ఉండటం, ముఖ్యంగా అక్కడ ఉన్న లింఫ్ గ్రంథులు (గ్లాండ్స్) వాయటం వలనవే అవి అనుభవపూర్వకంగా చెప్పవలసివస్తోంది. ఇలా వాయటం టి. బి., హాడ్జ్‌కిన్స్ డిసీజ మొదలైన వాటివల్ల జరుగుతుంది. ఈ కారణాలు కాకుండా శిరస్సు మీద గొంతు, ముక్కు, నోరు, చెవులు మొదలయిన వాటిలో చీముగాని, క్రిములు చేరటంవల్ల ఇతర అపలక్షణాలుగాని ఏర్పడినప్పుడు ఈ గ్రంథులు వాయటం జరుగుతుంది. అయితే ఇలా వాయటం ఆ రోగం ఉన్నంత కాలం మాత్రమే ఉంటుంది.

మీరు వ్రాసిన విషయాలను పరిశీలించినప్పుడు శస్త్ర వైద్యుల వద్ద హాడ్జ్‌కిన్స్ డిసీజ కొరకు పరిశోధించుకోవటం మంచిదనిపిస్తున్నది. తర్వాత వారిసలహా మేరకు ఎక్సరే ట్రీట్‌మెంట్ లేక శస్త్రచికిత్స చేయించుకోవటం ఉత్తమం.




బి. యస్. ఆర్ - కరీంనగర్

నేను ఇంతవరకు మూడుసార్లు గనేరియా ట్రీట్‌మెంటు తీసుకున్నాను. కాని నా స్నేహితుడు ఇది పూర్తిగా నయమవ్వదు, తిరిగి కొంతకాలానికి బయటపడుతుంది అంటున్నాడు. దీనికి రక్త పరీక్ష చెయ్యమంటారా?

గనేరియా అనే సుఖవ్యాధి మూడుసార్లు రావటం మీ మానసిక, వ్యక్తిగత ప్రవృత్తిని తెలియజేస్తున్నది. [ఒకవేళ ఆ మూడుసార్లు వచ్చినది గనేరియా అయితే] ఈ మీద మనసుకే కట్టుబట్టం, నియమం లేనప్పుడు ఇక మందులు వాడి ప్రయోజనం లేదు.

రక్తపరీక్షవల్ల సిఫిలిస్ అనే సుఖవ్యాధి వుంటేనే తెలుస్తుంది. గనేరియాకు మూత్రనాళము నుండి వచ్చు చీము వంటి ద్రవాన్ని పరిశోధించాలి. రోగనిర్ధారణ జరిగిన తర్వాత తప్పకుండా ఈ శాస్త్రీయ మార్గాల ద్వారా త్వరగా నయమయే అవకాశం ఉన్నది.

టి. వి. జె. - వెంటూరు

భగంధరము (ఫిస్టులా) ఎందుకువస్తుంది? అది వచ్చినపుడు ఏమి చెయ్యాలి?

మల విసర్జన నాళము యొక్క చివరిభాగము (ఏనస్) గోడలలో చీము ఏర్పడి, ఆ చీము బయట చర్మం ద్వారా పగిలి బయటపడినప్పుడు ఈ ఫిస్టులా వచ్చే అవకాశం వున్నది. అయితే ఇలా పగలటం లోపలి గోడలలో కూడా జరగాలి. అంటే ఒక రకం ద్రవము గుద స్థానములోనూ, ఒక రంధ్రము బయట చర్మంలోనూ వుంటుంది. ఈ చీము (పెరియేనల్ యాబ్సెస్) ఏర్పడటానికి ఎన్నో కారణాలున్నాయి.

ఈ ఫిస్టులాను నిర్మూలించటానికి నిపుణులైన శస్త్రవైద్యులచే నవీన పద్ధతులలో శస్త్రచికిత్స చేయించటమే చేయతగినది.

బయట పూతమందుల వల్ల ప్రయోజనం లేదు. ఇలా చేయుటం వల్ల బయట ద్వారం మూతబడి లోపల చీముచేరే అవకాశం వున్నది.

వి. కె. ఆర్ - రాజమండ్రి

నా వయస్సు 24 సం.లు. పుట్టుకనుండి నాకు దొడ్డికాళ్లు వచ్చినవి. దొడ్డికాళ్లు రావటానికి కారణము. ఇవి కనపడకుండా వుండటానికి ఏదైనా శస్త్రచికిత్స ఉన్నచో తెల్పండి.

పుట్టుకతోనే దొడ్డికాళ్లు వున్నా అలా అవటం చాలా అరుదు. పుట్టిన తర్వాత విటమిన్ డి లోపం ఏర్పడి వాటివల్ల ఎముకలు మెత్తపడి వంగటం జరుగుతుంది. దీనినే వ్యవహారికంగా దొడ్డికాళ్ళు అంటారు.

ఇవి కనబడకుండా చేయుటానికి కొన్ని ముఖ్య కేంద్రాలు మద్రాస్, బొంబాయి, ఢిల్లీ మొదలయిన చోట్లలో ఆస్థోప్లాస్టి అనే చికిత్సవల్ల నయమవుతుంది.

—డా॥ కె. వెంకటేశ్వరరావు

# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

**ఎస్. జె. పి. – అలంపూర్**

ఒక కోరిక తీరితే ఇంకొక కోరిక పుట్టుకొస్తుంది. ఈ కోరికకు అంతెప్పుడు ?

ప్రాణం ఆగిపోయినప్పుడు.

శ్రమజీవనమే జాతికి ధనమన్నాడు బాపూజీ కాని పోయినా త్రాగి అనుభవించి చావమన్నాడు ఉమర్ ఖయ్యామ్, ఏది ఆచరణీయం ?

బాపూజీ పిచ్చివాడు ! అంతా తనలాగా మొరార్జీల్లాగా మొండి ఘటాలై వుంటారనా ? తమిళనాడులో గుజరాత్‌లో ఎనిమిదేళ్ళ ధనంలేక చావమంటున్నారు. ఆంధ్రదేశంలో తాగి డబ్బు తగలెట్టి చావమంటున్నారు. ఏదైనా అనుభవం పట్టాదగొట్టి కుండాకు వీలు లేని అందుబాటులో వుంచే అదే బాగుంటుంది !

**కె. జె. హెచ్. ఎల్. – కుప్పం**

మీ అభిమాన పౌరాణిక వ్యక్తి ఎవరు ?

బాపూ, అబ్బో అదొకటే బాబూ !

**కె. ఆర్. కె. – రేపల్లె**

దేవాలయ యాజమాన్యం చేస్తూ, పెళ్ళి కెదిగిన పల్లగు ఆడపిల్లలు వుండ, దేవాలయంలో జరిగే పెళ్ళిళ్ళని చూస్తున్నప్పుడు అతని మానసిక ప్రవృత్తి ఎలా ఉంటుంది ? కరెక్టు ఆన్సర్ ప్లీజ్.

నిర్వేదం లాగా వుంటుంది. పెద్దమనిషిపుడిమీద, ఎదిగిన కూతుళ్ళమీద ఉక్రోషంగా ఉంటుంది. మళయాళం సినిమాలాగా ఉంటుంది? మిగిలిన ఆలోచన ! ప్రొసీడింగ్స్ ? !]

**ఎస్. వి. కె. ఆర్. – విజయవాడ**

చేతనావివాదం అంటే అందరికీ లోకువేనా ?

అంతేకద ! సింహం చచ్చిందంటే కుందేలు కుట్టి కూడా దాని దేహం పట్టిలాగుతుంది !

**ఆర్. బి. – అవంతపురం**

ద్వాపరయుగంలో కృష్ణునికి పదహారువేల మంది భార్యలు కదా ? వారి అందరూ గోపికలేనా ?

ఏం ప్రశ్న మహాశయా ! దేవుళ్ళని కూడా వ్యాపారానికి వదలరన్నమాట ! గోపికా కృష్ణులది అపాలిన ప్రేమ. ఆత్మల ఐక్యతేగాని శారీరక సంపర్కం కాదు. లేకపోతే ప్రపంచం అంతా కృష్ణభగవానుడిలా అక్రమ సంతానంతో నిండిపోయి వుండేది.

**వి. జి. ఆర్. – సికింద్రాబాదు**

మీ ఆడవాళ్ళకు స్వతంత్రం వచ్చినప్పటి నుండి వాళ్ళ ఇష్టానుసారం ప్రవర్తించి మగవాళ్ళను కనిపించేస్తూ భర్తలంటేవారికి ఏమీ కానట్టు వున్నది. కాని హిందూ సంప్రదాయ ప్రకారం భార్యకు సర్వ సౌభాగ్యములు భర్తే. అది భగవంతుడిచ్చినవరము ఆడవాళ్ళకు. అలాంటప్పుడు పిల్లలకు బుద్ధి కుదిరేట్లు బుద్ధి రావాలంటే నియంతృత్వం ఉపయోగిస్తే బాగుంటుందేమో ?

మీ ప్రశ్న పూర్తిగా రాశాను, అందరూ చదివితే బాగుంటుందని ! అసందర్భ ప్రలాపం. ఆడదానికి స్వతంత్రం ఎప్పుడూ ఎవరిచ్చారు ? ఆమెలో ఉద్యోగం వల్ల కొంచెం గుండెధైర్యం పెరిగిందేమో ! ఉద్యోగిని డబ్బు మీ చేత పోతూ తను బానిసగానే బ్రతుకుతోంది. పిల్లల తల్లి చాలవా) పిల్లల్ని కనక తప్పడంలేదు ! గొడ్డు చాకిరీ తప్పడం లేదు. మరి వరాలిచ్చి ప్రత్యక్ష దైవాలైన భర్తలైతే ఈ దైన్యావస్థ దేనికి ?! ఆడవారికి మీరు కోరే బుద్ధి చావతన్ని చెప్పులు మోస్తే చాలు ! భార్యలకి తాము మనుషులమన్న జ్ఞానోదయం రావాలంటే అది ఇంకో దారి !

**బి. వి. ఆర్. – విజయనగరం**

ఇప్పుడు ఆడుతున్న సినిమాలలో చివర జరుగుతున్న అనే కొండా విగ్రహమయం కానే కాదేం ?

తలుపులు తెరిచి వుంచితే సినిమాలే చూడకుండా పారిపోయేలా వున్నారు జనం. ఇంక నిజంగా జెండాకి గౌరవం దక్కిస్తే రక్షణ వస్తుందని లేక మానివేశారు తప్పకుండా.

**ఎస్. ఆర్. ఎస్. – సత్తుపల్లి**

హిందూ కుటుంబాల్లో వివాహ సందర్భంలో వరుడు వధువుకు మంగళసూత్రం కడతాడు ఎందుకని ? మూఢాచారమా సంప్రదాయమా ? ప్రయోజనం ఏమిటి ?

మూఢాచారం సంప్రదాయంగా మారిపోయి వుంటుంది ! ఇక ప్రయోజనం అంటారా – బంగారంవల్ల ప్రయోజనం ఏమిటి ? అవసరానికి అమ్ముకోవచ్చు ! సినిమాల్లో చూడ్డంలేద, తాను పోతూ, తిరుగుబోతూ, జూదరి అయిన భర్త పెళ్ళాం పుస్తెలు తెంపుకుపోవడం.

**ఆర్. ఎస్. మినాక్షి – ఒరిస్సా**

అక్కయ్యగారూ భార్యాభర్తలకి వయస్సు పెరిగే కొద్దీ ప్రేమ ఆప్యాయత ఎక్కువ అవుతా యంటారు. నిజమే.

నిజమే. శారీరక వాంఛల ఉధృతం తగ్గి స్నేహం పెరుగుతుంది. కొండ చరియల పవిత్ర జల్లిన సెలయేరు సమతలంపై చల్లగా ప్రవహించినట్లు. కాని ఒక్క చిక్కు. భర్తలు తమ వయస్సు పెరుగుతోందనుకోరు. భార్యలు ముసలి వాళ్ళయిపోతున్నారనుకుంటారు ! అందుకే నలభై దాటిన మగవాడు సుందరాంగులవేట ప్రారంభించడం నలభై దాటకపోయినా ఆడది పిల్లల బాధ్యతలో తన స్వంత సౌకర్యాలు సుఖాలు లెక్కచేయకపోడం జరుగుతూ ఉంటుంది. ●



సీరియల్

# ప్రేమపాశం

శ్రీమతి ప్రమీలాజనార్దన్

**మ**నోహర్ మనసు నిత్యం వ్యథ చెందేది

అతడి భార్య కోపమేనంటే నమ్మ తుందా శాంతి ?

ఈనాడు తన భార్య క్రొత్త వ్యక్తి ముందు చెలరేగితో అవమానింప బడినందుకు బాధ్యలెవరు ?

"జానకి ... తంగా చెప్తోందతడి

*(గత సంచిక తరువాయి)*

మనస్సు.

అతడి అర్ధాంగిగా వచ్చిన జానకి అతడి మేనమామ కూతురు. అతి మంచితనం, సౌజన్యంవల్ల, అనాదిగా వస్తున్న మనస్తత్వంలో మార్పు లేక పోవడం వల్ల అఖంటి దాసి మనిషే అయింది.

పౌరోహిత్యం చేసుకొని జీవించే అన్నగారి కూతుర్ని మెడిసన్ చదువుతున్న తన కొడుక్కు చేసుకోడం ఇష్టం లేదు తులశమ్మకు. కాని చిన్నప్పటనుకున్న పెద్దల మాటలను మరవలేని జానకి మాత్రం అతడ్ని దప్ప మరెవర్నీ చేసుకోనని తల్లి దండ్రులతో చెప్పడమే గాకుండా ఓనాటి సాయంత్రం మనోహర్ ఇంటికి వెళ్ళి అతడినే "నన్ను చేసుకోడానికేమిటి అభ్యంతరం ?" అని అడిగితే అతడు తెల్లబోయి చూశాడు.

"నీ కిష్టంలేదంటే చెప్పు. మళ్ళీమళ్ళీ యెవరూ అడగరు."

"అసలిప్పుడెందు కొచ్చింది ప్రశ్న ?" అతడి కప్పుడే పెండ్లి చేసుకోవాలని లేదు. జానకి గురించి అంత సీరియస్‌గా ఆలోచించకపోయేందుకు కారణం గూడా వుంది. చిన్నప్పుడేవో అనుకున్నా అతడు కాలేజి మెట్లెక్కినప్పటినుండి తల్లి ఆ పిల్ల గురించి యెక్కువగా మాట్లాడేది కాదు. ఒకేవూళ్ళో వుండడం వల్ల రాకపోకలు ఇదివరకంత చురుగ్గా సాగకున్నా తప్పేవి మాత్రం కావు. జానకి నాలుగురోజుల కొకసారి తప్పకుండా వస్తూంటుంది. కాని తను చేసుకోవాలను కుంటున్న భావగాంభీర్యం, ఆమెను అతడితో చనువుగా వుండనిచ్చేది కాదు.

ఆ రోజలా నిలదీసి అడిగిందంటే అతడికి ఆశ్చర్యం గలిగింది. ఆ కండ్లలో ముఖంలో కనిపిస్తున్న అమాయకత్వం చూసి జాలి వేస్తుంది అనిపించింది.

"నా కిష్టం లేదంటే?" ఆమె కండ్ల లోకి చూశాడు.

"నా కదృష్టం లేదనుకుంటాను. నా జీవితాన్ని పెండ్లి సంసారమనే మార్గంగాక, మరే మార్గంలోనైనా పడే ప్రయత్నం చేస్తాను."

"జానకీ!" నిర్ఘాంత పోయాడు.

'ఆమె గురించి తనేమీ తెలుసుకోలేదు. కాని ఆమె తనమీద ఆశ పెంచుకున్నది. ఈ సంబంధం చేసుకుంటే కట్నం కానుక లుండవని, అల్లుడిగా ఆ యింట ఘనసత్కారాలు జరగవని తల్లి వుద్దేశ్యం. కాని అభిమానించిన ఈ అతివ మనసు కన్నా అవి ముఖ్యమా? అసలు తనకేం తవరానున్నాయని, వారికి లేవనుకోవాలి? తను మెడిసన్

అంకితం కాలేను. నిన్ను నేను మరిచే మార్గా న్వేషించి, జీవితం సాగిస్తాను.''

"నేను నిన్ను కాదన్నప్పుడు గదా ఈ ఆలోచన ?'' యెటో చూస్తూ అన్నాడు.

"బావా !'' ఆనందోద్వేగంతో అంది.

"నీవిచ్చిన మనస్సునే ధనం ముందు, యెంత ధనమైనా విలువలేనిదేనని తెలుసుకోలేనంత మూర్ఖురాణ్ణి కాదు జానకి.''

"నిన్ను కోరడం లోకం దృష్టిలో దురాశేకావచ్చు. కాని నాకలా అనిపించడం లేదు బావా. నా వస్తువు నేను అనుభవించబోతున్నట్లనిపిస్తున్నది. నావల్ల నీకెప్పుడూ

యే బాధ రానివ్వనని మాత్రం గట్టిగా చెప్పగలను." అని తల్లిదండ్రులకా విషయం తొందరగా చెప్పాలనేమో పరుగెత్తి వెళ్ళిపోయింది.

అంత దృఢంగా తన కోరికను వ్యక్తపరిచిన ఆమెను తలుచుకుంటూ ఆ రాత్రి భోజనాలు చేస్తుండగా, తండ్రి యెక్కడెక్కడో పెండ్లి సంబంధాల గురించి చెప్తుంటే "జానకి వుండగా మరోపిల్లనెందుకు చూడడం?" అన్న మనోహర్ మాటలకు మండిపడ్డారు తులశమ్మ-శంకరయ్య.

"వాళ్ళు నీకేదో నూరిపోసి వుంటారు. నీకు పెండ్లికి తొందర వచ్చిందని కాదు; నీ చదువు నిరాటంకంగా సాగాలని చెయ్యాలనుకుంటున్నామని గుర్తుంచుకో" వురిమి చూశాడు శంకరయ్య.

తండ్రి మాటల ఆంతర్యం మర్మమయింది. "ఇంకో సంవత్సరం వున్న తన చదువుకయ్యే ఖర్చు తనకు పిల్లనిచ్చే తండ్రి భరించాలి."

"వాళ్ళు వదును మర్యాదలుచేసి ఆడపడుచులకు కట్నాలు ఫర్నిచర్ గూడా ఇస్తామన్నారు..." తనతో యేం సంబంధం లేనట్లు తల్లితో చెప్పుకుపోతున్న తండ్రి మాటలు అతడికి కంపరం పుట్టిస్తున్నాయి.

"డాక్టర్ అల్లుడు కావాలంటే వూరికేనా?" తండ్రి గర్వంగా అంటే అతడికి సంతలో గేదె గొప్పతనాన్ని పొగుడుతూ బేరం పెడుతున్నట్లుగా వుంది.

'ఆర్థిక స్థితినిబట్టి ఇప్పుడు డబ్బు అవసరమే. కాదనలేదు. కాని అది తన పెండ్లి మూలంగా రావాలనుకోడం అతడికి బొత్తిగా నచ్చలేదు. పెండ్లి వ్యాపారం కాదు. జీవితాంతం కలిసి బ్రతకాల్సిన మనుష్యులను డబ్బు కలపడమా! తన నమితంగా కోరుకుంటున్న జానకిని డబ్బు లెని కారణంగా ... యెంత అన్యాయం! జానకి ఈ ఇంట యే రత్న మాణిక్యాల నాశించి తనను కోరుతున్నది! కేవలం తనను... తననే కోరుతున్న ఆమెను డబ్బు కారణంగా కాదనడం రాక్షసత్వం. అహంకారం. అంతేకాదు. అమ్ముడుపోయి చదివే ఆ చదువెందుకు చదవాలి? ఆ తర్వాత వాళ్ళ చేతిలో కీలుబొమ్మలా మారిపోయే అవకాశాన్నెందుకు ఆహ్వానించాలి?' క్షణంలో విప్పో ఆలోచనలు



ప్రోగై, అతడి నో నిర్ణయానికి వచ్చేట్లు చేశాయి.

"కట్నంగా వచ్చే డబ్బుతో చదువుకోవాలని నాకులేదు. ఇంతవరకొచ్చిన నా చదువు ఆగిపోదు. నా పెండ్లి మాత్రం జానకితోనే జరగాలి" అన్నాడు

"నీ కిది స్వంతంగా పుట్టిన బుద్ధి కాదు..." తల్లి ఇంకా ఏదో అనబోతుంటే, "చిన్ననాట చిన్న మీ మాటలు వయసుతో బాటు కోరికను పెంచగా ఆర్తిగా అర్థించిన మనసును కాదనగలిగేంత కఠిన హృదయం లేనివాణ్ణి. నేను కావాలనుకున్న నారి తోడి

**నగరాన్ని చల్లబరచటానికి**

**జలపాతం**

మధ్యాసియా ని నూరెక్ నగర వాతావరణాన్ని చల్లబరిచేందుకు ఒక బ్రహ్మాండమైన జలపాతాన్ని నిర్మించడం జరిగింది. ఈ నగర ఉష్ణోగ్రత ప్లస్ 45 డిగ్రీల సెంటిగ్రేడ్ వుంటుంది. ఈ నగరం లోతైన పర్వత లోయలో వుంది. అతి ఎత్తుగా కట్టిన యీ జలపాతం తుంపరులు ఈ నగరంపై జల్లుగా పడే విధంగా చేయడం ద్వారా యీ నగరాన్ని చల్లబరుస్తున్నారు. ఈ నగరంలోని అసంఖ్యాకమైన వనాలు, పార్కులు సైతం వేడిని తగ్గించడానికి పనికి వస్తాయి. మధ్యాసియాలోనే అతి పెద్దదైన జల విద్యుత్ కేంద్రం యీ నగరంలో వుంది.

జీవితమే ఆనందదాయకమౌతుందన్ననమ్మకము వున్నవాణ్ణి ముగ్ధత్వం మూర్తీభవించిన జానకి, అనురాగానికి ప్రతరూపమమ్మా! అమృతం చిందే ఆ గుండెలో తాత్కాలిక ప్రయోజనం కోసం కన్నీళ్ళు చిలికించడం భావ్యం కాదమ్మా."

కొడుకు మాటలకు క్షణం నిశ్చేష్టితమైంది తులశమ్మ: "నీ చదువెలా?"

"ఆగిపోదని ముందే చెప్పానుగా. నాన్నస్థితి నాకుతెలుసు. ఆయన్ను ఇబ్బంది పెట్టను."

శంకరయ్యకు కొడుకు నిర్ణయం నచ్చలేదు. మాట్లాడకుండా గబగబ అన్నం తినిపోగాడు.

ఆ తర్వాత రెండు రోజులవరకు ఇంట్లో పెండ్లిని గురించిన మాటలేమీ రాలేదు. మూడోనాటి సాయంత్రం తనంత తానుగా ఆ విషయం వినాల్సి వస్తుందనుకోలేదు మనోహర్.

కాలేజి నుండి ఇంటికి వస్తుండగా, ఇల్లు కాస్త దూరంలో వుండగా జానకి కనిపించింది.

"నేను నీ కోసమే వస్తున్నాను." అంది ఆత్రంగా. ఆమె ముఖం చూస్తే జరగరాని దేదో జరిగితే బెదిరిపోయినట్లుగా వుంది.

"యేమయింది?" భయంగా అడిగాడు మనోహర్.

"వివరంగా చెప్పే అవకాశం లేదు. అందుకే ఈ లెటర్ వ్రాసి తెచ్చాను చదివి; రేపీపాటికి ఇక్కడే నీ నిర్ణయం తెలుపు. కూరలు తెస్తానని అమ్మతో చెప్పి వచ్చాను" అంటూ అతడి చేతికి కాగితం ఇచ్చి వేగంగా కూరలబండి వైపు నడిచింది.

జానకి పెద్ద మాటకారేం కాదు. అయినా ఇంత ముభావంగా, భయంగా అతడి ముందెప్పుడూ లేదు. ఆమె ప్రవర్తన అతడికేవేవో సందేహాలను గలిగిస్తున్నది. ఆమె ఇచ్చిన లెటర్ చదవాలని తొందర పడుతున్నది మనస్సు ఇంటికి వచ్చి కాళ్ళు, చేతులు కడుక్కొని కాఫీ త్రాగి వచ్చి తన గదిలో కూర్చొని పేపరు విప్పాడు. ఆమెలా అందంగా, నీటుగా వున్నాయి అక్షరాలు.

"నీవెప్పుడు నన్ను నీ దాన్నిగా చేసుకోడానికి అంగీకరించావో ఆ క్షణమే నా బాధ్యత నీదయింది. నేను నీదాన్ని. నీదాన్ని కాపాడుకోవల్సిన బాధ్యత నీకు లేదా? అందుకే నీకీ లెటర్ వ్రాస్తున్నాను.

బావా, ఇది నీ మీద అధికారంతో శాసించడం కాదు. నీ నుండి శాశ్వతంగా దూరం చేసే బంధాన్ని తదిలించబోతున్న అమ్మా, నాన్నల కేమీ చెప్పలేక నిన్ను అర్థిస్తున్నాను.

నీవు నన్ను చేసుకోవేందుకు ఒప్పుకున్నావని యెంతో సంతోషంగా చెప్తే, అమ్మ యేడ్చింది. నాన్న, కూతుర్ని మేనల్లుడి మీదికి వుసిగొల్పావన్న చెడుపేరు వస్తుందని అరిచాడు. తిట్టాడు. ఇక పెండ్లియ్యేంతవరకు ఇల్లు కదల వద్దన్నాడు.

...యనే మాట కాదనలేము. మనసు చంపుకో లేను. నన్నీ బాధనుండి విముక్తురాలిని చెయ్యి బావా.

ఇంతకన్నా యేంచెప్పాలో యెలా చెప్పాలో నాకు తెలియదు. నిన్న సాయంత్రం బలవంతంగా నన్నో పెండ్లి కొడుక్కి చూపించారు. మనసు చూడలేని అతడు నేను నచ్చానని అప్పుడే చెప్పాడు. మా స్థితికి తగిన సంబంధమని అమ్మా నాన్న తృప్తిపడ్డారు. కాని నేను ... యేంచెప్పను బావా? హృదయంలో ప్రతిష్ఠించుకున్న నీ రూపాన్ని తుడిచేసుకొని అతడిత

మనుగడ సాగించగలనా? పుహుం. ఆ వూహే భరించలేక పోతున్నాను.

చెప్పాల్సినదంతా చెప్పాను. ఇక మన్నేం చేస్తావో! రేపు నీ నుండి యే జవాబు రాకపోతే, నేనే యేదో ఒక నిర్ణయానికి వస్తాను. అయితే ఇష్టంలేని పెండ్లి చేసుకొనే ఆలోచనే లేదు.

నా మాటలు చూసి సిగ్గులేని దాన్నను కుంటున్నావు కదూ! మనసు విప్పి చెప్పు కున్న నన్ను యేమనుకున్నా ఫరవా లేదు. నీ సమాధానం కోసం నిరీక్షిస్తుంటాను.

ఇట్లు,
నీది కావాలనుకుంటున్న,
జానకి

లెటర్ చదువుకున్న మనోహర్‌కు తనేం చెయ్యాలో తోచడం లేదు 'జానకి తనమీద వుంచిన ఈ బాధ్యతనెలా నిర్వర్తించడం?' కొద్ది సేపయ్యాక బట్టలు వేసుకొని వీధి లోకి వచ్చాడు.

తన చదువు పూర్తయ్యాక తప్పకుండా జానకిని పెండ్లి చేసుకుంటానని అత్త మామలకు చెప్పాలనుకొని వాళ్ళింటి వైపు నడిచాడు.

వారగా వేసివున్న తలుపులను త్రోసుకొని లోపలికి వెళ్ళబోయిన మనోహర్, జానకి యేడుస్తూ మాట్లాడుతున్న మాటలు విని ఆగిపోయాడు.

"మీరు అనుమానించినట్టే బావ నన్ను చేసుకోకపోతే నేనిలాగే వుండిపోతాను. వద్దు

# ప్రేమ పాశం

నాన్నా. నాకా సంబంధం చెయ్యొద్దు. నేను చేసుకోలేను."

"బాగుంది వాడికోసం నీ బ్రతుకు బండలు చేసుకుంటావా? జానకీ, నీ హితవు కోరి చెప్పే నా మాట వినమ్మా. ఆస్తులు పాస్తులు లేకపోయినా, అబ్బాయి వుద్యోగం చేస్తున్నాడు. మళ్ళీ ఇలాంటి సంబంధం రాదు. వచ్చినా వీళ్ళలా కట్న కానుకల మీద ఆశ లేనివారుండరు." తండ్రి నచ్చ చెబుతున్నాడు.

"నేను తులసి ఒక కడుపున పుట్టినా, పరిస్థితులు వియ్యమందేందుకు అనుకూలించడంలేదు. నీవిలా మొండికేస్తే నీ పేద తండ్రిని స్వార్థపరుడిగా, నీచుడిగా చెప్పుకుంటుందమ్మా లోకం. అతడి మీద మమతతో నీవిలాగే వుంటే ముందు జీవితం ముళ్ళబాట అవుతుంది. ఒకే కాలంలో అన్ని రకాల పండ్లు, పూలు రావు. మనిషి జీవితం కూడా అంతే తల్లీ. యేవయసున జరగాల్సినవి ఆ వయసులో జరగాలి. అలా జరగక పోతే అవహేళనలు, అపనిందలు. ఆ తర్వాత బ్రతుకును రచ్చకీడుస్తారు మనుష్యులు. ఇది ఈనాటి ఆచారాలు కాదమ్మా. తోడు నీడ లేని ఆడదంటే అలుసై పోతుంది."

"అలా జరుగుతుందన్న అనుమానం వస్తే, నేనీ లోకంనుండి నిష్క్రమిస్తాను" జానకి ధైర్యంగా అన్న మాటలు మనోహర్




నావేశపరిచి రివ్వున లోపలికి వచ్చేట్టు చేశాయి.

"జానకీ" యేడుస్తూ గోడనానుకొని నిల్చున్న ఆమె చెంతకు వచ్చాడు.

సీతమ్మ, రామయ్య ఆశ్చర్యంగా చూస్తున్నారతడి వైపు.

"జానకీ నా కారణంగా నువ్వు మృత్యువును చేరకొనేందుకు గూడా సిద్ధపడతావా? వద్దు జానకీ, వద్దు నీకలాంటి పరిస్థితి రాగూడదు. ఇంతవరకెలాంటి భావం లేని నన్ను... కదిల్చి పెగెలుచుకున్నావు జానకీ. ఈ మమతా మూర్తి కంట కన్నీరు కురవ గూడదు. ఇంత అభిమానాన రాగాల సంపద సంపాదించుకున్న నేనెంత అదృష్టవంతుణ్ణి!"

"మనూ" రామయ్య యేదో అనబోతుంటే, "నువ్వింకేం చెప్పొద్దు మామయ్యా నీఅనుమానంనాకర్థమయింది. జానకికి నువ్వు చూసిన ఆ సంబంధంతో యెప్పుడు పెండ్లి చెయ్యాలనుకున్నావో అప్పుడే నాతో చేసెయ్యి." అన్నాడు.

"నీ మీద యెన్నో ఆశలు పెట్టుకున్నారు మీ అమ్మా, నాన్న" చిన్నగా అన్నాడు రామయ్య.

"నాతోనే తన జీవితాన్నూహించుకొని చివరికి చావుకైనా సిద్ధపడతానన్న జానకిని చేసుకోడం వల్ల అమ్మా, నాన్నల కన్యాయం జరుగుతుందా? వారి యెడల నా బాధ్యత నే నెప్పుడూ విస్మరించను." అన్నాడు.

"జానకీ, రేపు చెప్పమన్న నా నిర్ణయం ఇప్పుడే చెప్పాను. ఇక వెళ్ళొస్తాను." అంటూ వెళ్ళబోతుంటే "వుండు బాబూ, కాఫీ తెస్తాను." అంది సీతమ్మ.

కాఫీ త్రాగి ఇంటికి వెళబోతూ జానకి యేదైనా మాట్లాడుతుందేమోనని ఆమె వైపు చూసిన అతడికి కండ్లు వెడల్పుచేసి చూస్తున్న ఆమె చూపులో కృతజ్ఞత కనిపించింది. పలుకులేని బొమ్మలా వుందా సమయంలో ఆమె.

* * *

కొడుకు మాటలు విన్న శివయ్య వ్యగుడయ్యాడు. "నీకు మన్ని పెద్దవాడి వయ్యావు. మేము అప్రయోజకులమై మరో సంబంధం చూస్తున్నామనుకున్నావా? నీకు లేదు గాని నీ మెడకో బండ. నీ కట్నండబ్బు అనుభవించి పొంగి పోవాలని

# ప్రేమ పాశం

గాదు, నీకు వేరే సంబంధం చూడడం. నీ చదువుకోసం, తెలిసిందా? నీ మూర్ఖత్వం వదిలి వాళ్లను మరో సంబంధం చూసుకో మను."

"జానకి చేసుకోనన్నది."

"యెందుకు చేసుకుంటుంది? డాక్టరు మొగుడు కావాలని ఆశ."

"నాన్నా" తీవ్ర స్వరంతో అన్నాడు. "ఆమె కోరుకున్నది డాక్టర్ని కాదు. నన్ను. నాకోసం ప్రాణత్యాగం చేసేందుకైనా సిద్ధంగా వున్న ఆమెను కాదని, రేపామె ఏమైనా అయితే జీవితాంతం కుమిలి పోవాలి. ఆమె అనురాగానికి పెడ అర్థాలు కల్పించడం అమానుషం నాన్నా. నా పెండ్లి ఆమెతోనే జరగాలి."

"జరగకపోతే?"

"యెందుకు జరగదు?" తండ్రి యెంత ఆవేశంగా అన్నాడో అతనంత ఆవేశంగానే ప్రశ్నించాడు.

"నా కిష్టం లేదు."

"నాకు తెలుసు నాన్నా" బాధగా చూశాడు.

"మనిషి కవసరమైన మమతాభిమానాలు తప్ప, కట్న కానుక లివ్వలేని ఆమె హృదయాంకితుడనైన నేను కఠినంగా ప్రవర్తించలేనని మీ కిదివరకే చెప్పాను. డబ్బు సంపాదించవచ్చు. అనురాగం భగవంతుడిచ్చే వరం. ఈ విషయంలో మీతో ఏకీభవించ లేనందుకు క్షంతవ్యుణ్ణి."

ఇక కొడుకు తమ దారికి రాడని తెలుసు కున్నారు శివయ్య, తులశమ్మ. ఆ పిల్ల అందానికి మైమరచి చదువు విషయంగూడా మరిచావని కోప్పడ్డారు. అతడు పలకలేదు.

"పెండ్లికేం తొందరలేదు. చదువు పూర్తిగానీ." చివరిగా అన్నాడు శివయ్య.

"పెండ్లి చదువు కాటంకం అవుతుం దనుకుంటే ఇంతవరకెలా ఆ ఆలోచన చేశారు?"

"మీకు ముందే చెప్పాను నేను అనురాగ బంధితుణ్ణని. ఆ బంధం నుండి తప్పించు కోవాలని లేదు. అత్తయ్యకు, మామయ్యకు నామీద నమ్మకం లేదు. అదిగాక కుట్ర తత్వంతో యేదో చేశారని అందరనుకుంటా రని ఆమెమీద వత్తిడి తెస్తారు. నా కార





లంగా ఆమె క్షోభించడం నేను భరించలేను."

ఆలస్యం జరిగితే తమ ప్రమేయం లేకుండానే పెండ్లి చేసుకుంటాడేమోనని పించింది కొడుకు మాటలు విన్న శివయ్యకు.

అందుకే రామయ్య వచ్చి అడగ్గానే పెద్దరికం నిలుపుకోవాలనే తాపత్రయంతో పెండ్లి కంగీకరించాడు.

ఆ తర్వాత పది రోజులకే పెండ్లయి అత్తవారింటికి వచ్చింది జానకి.

మనోహర్ కొద్ది రోజులుగా చేస్తున్న ప్రయత్నం ఫలించి రెండు ట్యూషన్స్ దొరికాయి. ఒక చీఫ్ అతడికి సాయంత్రం పూట సహాయం చేసేందుకు రమ్మన్నాడు. ఇప్పుడు అతడి చదువుకు ఇబ్బంది లేదు. 'ఆ తర్వాత హౌస్ సర్జన్‌గా గిరున తిరిగి పోతాయి రోజులు' అనుకున్నాడు.

కోరుకున్న వాడ్ని చేపట్టినా అక్కడి వారందరి హృదయాలలో తన మీద నీలాంటి అభిప్రాయం వున్నదో తెలుసుకున్న జానకి కోటి కోర్కెలతో తియ్యటి కలలు గంటూ ఆ ఇంట అడుగు పెట్టలేదు. వారందరి అభిమానం సంపాదించుకోవాలన్న ధ్యేయంతో వున్న ఆమెకు తల్లి గూడా అదే బోధించింది.

"నిన్ను కాదనుకున్న వారే నిన్ను మెచ్చుకొనే రోజు వచ్చేలా ప్రవర్తించాలమ్మా. అప్పుడే నిన్ను కన్నవారికి గర్వం ఆనందం కలిగేది." అన్న తల్లి మాటలు తలుచుకొని 'మీకోసమే గాదమ్మా నేను సుఖ సంతోషాలతో వుండాలన్నా వారి అభిమానం కావాలి' అనుకుంది.

"జానకీ, నన్ను గెలుచుకున్న నీవు, ఇంట్లో వారందర్నీ మెప్పించాలి. అలా చెయ్యగలవన్న నమ్మకం నాకుంది. నా మీద యెన్నో ఆశలు పెట్టుకున్న వారి ఆశలు తీర్చడం నా ధర్మం. వాళ్ళ ముందు జీవితాని కాధారం నేనే. నన్ను కట్టుకున్నందుకు వాటిని నువ్వూ స్వీకరించాలి" అని తొలిరోజే చెప్పాడు భర్త.

'అతడి జీవితంలో భాగం పంచుకున్న తనకు బాధ్యతలలో భాగం పంచుకోవాలని తెలియదా?' అనుకున్న ఆమె ఇంట్లో జరుగుతున్న మార్పులను సీరియస్‌గా తీసుకోలేదు. వారం తిరక్కుండానే వంటపని, ఇంటిపని పూర్తిగా నెత్తిన పడ్డది.

తన కోరిక నెరవేరిన సంతోషంలో ఆమెకేవీ బాధగా కష్టంగా అనిపించలేదు.

'తను ఆ యింటి కోడలు. అందరి బాగోగులు చూడాల్సిన బాధ్యత తనకున్న' దనుకున్న ఆమెకు, కట్న కానుకలు లేని తనను చులకనగా చూస్తున్నారని, తనకు వాళ్ళ మనసులలో పనిమనిషి కిచ్చే స్థానమే ఇచ్చారని తెలియదు మొదట.

"అబ్బ! యెప్పుడూ హడావుడిగానే వుంటావు," కొంగొత్త కోర్కెలు చెలరేగే ఆ తొలి రోజులలో జానకి తన కెప్పటికోగాని కనిపించక పోవడం కోపం తెప్పించేది మనోహర్‌కు.

"కోరి పెండ్లి చేసుకొని వన్నెడిపిస్తున్నావు." అని అతడంటే "ఏమండి" అంది గద్గద స్వరంతో.

## మాయలేడి

ఈ అద్దం నను మురిపిస్తున్నది
నే నందంగా వున్నానని
ఈ మమత నను మరిపిస్తున్నది
ఇదే శాశ్వతమని.
కనులలోన నీటి పూల గుత్తులు
గుండెలలోన ఏవో ఆశల శరత్తులు
ఔరా, ఈ జీవితం యింత వగలాడి?
మరులు గొలిపే మాయలేడి!

— కోపల్లె పూర్ణావిఠల్.

"మిమ్మల్ని బాధ పెట్టాలని లేదు. బాధ పెడుతున్నానని తెలియదు. మీ కోసం యేం చెయ్యమన్నా చేస్తాను. చెప్పండి." బేలగా అన్న ఆమె మాటల్లో అనురాగం చిందులు వెయ్యగా "జానకీ" అంటూ హృదయానికి హత్తుకున్నాడు.

"నా కోసం నిజంగా యేమైనా చేస్తావా?"

"తప్పకుండా."

"అయితే రేపు సాయంత్రం పిక్చర్‌కు వెళ్దాం. నేను కాలేజి నుండి వచ్చేటప్పటికి సిద్ధంగా వుండు."

కొద్ది క్షణాలాగి అంది. "మీరిప్పుడింకా విద్యార్థిగానే వున్నారు. మన సరదాలు, సంతోషం కోసం మామయ్యను కష్టపెట్టడం..." మాటలు పూర్తి చెయ్యలేకపోయింది.

"జానకీ, నీ వయసెంత?" గబుక్కున ఆమె భుజాల నాని ముఖంలోకి చూశాడు.

"యేం, మీకు తెలియదా?"

"తెలుసు. పద్దెనిమిదేళ్ళ వయసును దాటి నాకు తెలియకుండానే నలభయ్యోపడిలోనో, యాభయ్యో పడిలోనో యెప్పుడు పడ్డావు?"

పకప్పున నవ్వింది. "మూడు ముళ్ళు ఆడదానికి పెద్దరికాన్నిస్తాయి."

"మనసును రెచ్చగొడతాయి గూడా."

జానకి వదనం సిగ్గుతో యెరుపెక్కింది.

"జానకీ నీ వుద్దేశ్యం నాకు తెలుసు. నీలా యెందరాలోచించగలరీ కాలంలో. కాని నేను మరీ అంత అవివేకుణ్ణి కాదు. భార్యతో సినిమా కెళ్ళేందుకు తండ్రిని డబ్బు అడగాల్సిన పరిస్థితి రాగూడదనే, సంపాదించే మార్గాలను వెదికాను. దొరికించుకున్నాను."

"మీరు ... మీరు సంపాదిస్తున్నారా? యెలా?" ఆ సమయంలో అతడి చూపు లెటో వున్నాయి గని, జానకి కండ్లలోకి చూసినట్లయితే తను ట్యూషన్స్ చెబుతున్నది, చీఫ్ దగ్గరి కెళ్తున్నది చెప్పగలిగేవాడు కాదు.

"వద్దు. రేపటినుండి వాటిని మానెయ్యండి." అజ్ఞాపిస్తున్నట్లే అంది.

"ఎందుకు?"

"మీరు చదివేది పెద్ద చదువు. మనసు దానిమీద లగ్నం కావాలి."

"ఈ ప్రపంచంలో యెవ్వరూ చదవని చదువు నేను చదువుతున్నానా? విదేశాలలో అయితే యెవరికి వారు కష్టపడి సంపాదిస్తూనే చదువుకుంటారు. నేను శ్రమ పడుతున్నదేమీ లేదుగాని, రేపు సినిమా విషయం మాత్రం మరిచిపోకు" అన్నాడు.

"అలాగే." తలూపింది జానకి. భర్తతో కులాసాగా కబుర్లు చెబుతూ తిరగాలని తనకు మాత్రం లేదా? అతడింకా చదువుతుండడం వల్ల కొన్నాళ్ళు తన కోరికలు తీరవనుకుంది.

భర్త చదువుకుంటూ సంపాదిస్తున్నాడంటే, అతడికి కష్టంగా వుంటుందని బాధగా వున్నా, తమ ఖర్చులకు గూడా మామగారి నడగకుండా జరుగుతుందని సంతోషంగా వుంది మరో వైపు.

(ఇంకా వుంది)

## హైదరాబాదు నోట్‌బుక్

**వైష్ణవ సేవా కళాసమితి :**

అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా వైష్ణవ సేవా కళాసమితి ఆగస్టు 18న నారాయణగూడాలోని ఆంధ్ర బాలానంద సంఘం హాలులో బాలల కార్యక్రమాలు నిర్వహించింది.

శ్రీమతి ఎం. పెరుందేవమ్మ, డాక్టర్ ఎం. విజయకుమారి పర్యవేక్షణ కింద చిరంజీవులు ప్రేమలత, పద్మలత, కవిత, సంగీత, వందన నృత్యం ప్రదర్శించారు. సుమిత్ర జావళీ నృత్యం చేసింది. శ్రీమతి ఎ. రంగమణి ఆధ్వర్యంలో లలిత, అనిత, రాజశ్రీ, రమ, శ్రీలేఖ, రేఖ, మాలతి కూచిపూడి నృత్యనాటిక ప్రదర్శించారు. బేబీరాణి, ఐదుసంవత్సరాల బాలిక గోంగూర జానపద నృత్యం ప్రదర్శించింది. బదరీనాద్ రచించి దర్శకత్వం వహించిన బుద్ధి వచ్చింది, మంచిరోజులువచ్చాయి నాటికలను రఘువేందర్, రాజారావు, శ్రీకాంత్, పద్మ, శోభారాణి, శివకుమార్, లక్ష్మినరసు, దుర్గాభవాని, వేణుగోపాల్, ఉదయభాస్కర్, గాయత్రి, అన్నపూర్ణ, శాంతకుమార్, మురళీమోహన్, శేషశాయి పాల్గొన్నారు. విరామసమయంలో చిన్న పిల్లలు హాస్యపు జల్లులు అందించారు. వైరాపన్యాసకుడు, మూకాభినయం, దొంగపోలీసు, ఎరుకలసాని— అవ్వ, ప్రత్యేకాకర్షణ. ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన రేడియో అన్నయ్య శ్రీ న్యాయపతి రాఘవరావు, ముఖ్యఅతిథిగా ఉన్న శ్రీ తిరుమల రామచంద్ర, సమితి అధ్యక్షుడు శ్రీ ఎస్. భక్తవత్సలం పిల్లలను ఆశీర్వదించారు. కుమారి రుక్మిణి వందనసమర్పణచేసింది. సమితికార్యదర్శి శ్రీ ఎస్. సి. భరతాచార్యులు ఈ కార్యక్రమం చక్కగా నిర్వహించారు.

**రాష్ట్ర జనతా నాయకుల ఆగ్రహం :**

కేంద్రంలో చరణ్ ప్రభుత్వం రాజీనామా చేసిన పిదప, ఉన్నవాటిలో పెద్దపార్టీ అయిన జనతాపార్టీ నాయకుడు, ప్రతిపక్ష నాయకుడు అయిన శ్రీ జగ్జీవన్‌రామ్‌ను ప్రభుత్వం ఏర్పాటు చేయాలని రాష్ట్రపతికోరక, లోక్‌సభను రద్దుచేసి, వచ్చే నవంబర్‌లో లోక్‌సభకు మధ్యంతర ఎన్నికలు జరిపించాలని వుత్తర్వుచేయడంతో రాష్ట్రంలో పలువురు జనతానాయకులు రెచ్చిపోయారు. రాష్ట్రపతి రాజీనామా చెయ్యాలని రాష్ట్రజనతా నాయకులు ఐదుగురు ఒక సంయుక్త ప్రకటన చేశారు. రాష్ట్రపతి పక్షపాత వైఖరితో ప్రవర్తించారు. ఆయన తీసుకొన్న నిర్ణయం రాష్ట్రానికి అపకీర్తి తెచ్చింది. ఆయన చర్యకు ఎంతో సిగ్గుపడిపోతున్నాము. ఆయన రాష్ట్రపతి భవనాన్ని అధికార రాజకీయాల రంగంగా, కుట్రశాలగా మార్చారు అని వారు తమ ప్రకటనలో అన్నారు.

# హైదరాబాద్ నోట్‌బుక్

## "పాత విద్యావిధానాన్ని కాల్చాలి"

అమ్మయ్య! ఇంతకాలానికి ఒకమంచి మాట విన్నాము. పాతవిద్యావిధానం వల్ల కాకతాళీయంగా మనకు లాభం కలిగిన మాట వాస్తవమే అయినా, దాని లక్ష్యం బ్రిటిష్ వారి సామ్రాజ్యాన్ని సుస్థిరం చేయడమే. అలాటి గులామీకి దోహదం చేసే పాత విద్యవిధానం పూర్తిగా రూపుమాపి, పిల్లల మనోవిధ్యాసనాలకు అవకాశం కలిగించే, దేశానుగుణమైన నూతన విద్యావిధానం రూపు దిద్దుకోవాలి. మరొక సంగతి. చదువు దృష్టి మనస్సంస్కారం. ప్రతి పౌరుడూ సంస్కారవంతుడు కావాలి గనుక చదువుకోవాలి. జీవిక ఆనుషంగికం. జీవికలేక ఎవరూ మనజాలడనడం నిజమే. కాని నేను ఇంత చదివాను, ఇన్ని డిగ్రీలు సంపాదించాను. నాకు నౌకరీలేదు. ఏం దేశం? పరాయిదేశానికి పోతాను. అనే మనస్తత్వమూ మారాలి. చదువు మనస్సంస్కారానికి, వృత్తి ఏదైనా జీవికకోసం చేయవచ్చు. అనే చిత్తవృత్తి పెరగాలి. ఇంత డబ్బు పోసి చదివాను. లేక చదివించాను. ఈ నష్టం ఉద్యోగాలతో సహా పిల్లనిచ్చే తండ్రినుంచి లాగుదామా, ఉద్యోగంలో చేరి లంచాలతో భర్తీ చేసుకొందామా? అన్న వ్యాపార ధోరణి పోవాలి. ఇప్పటిపద్ధతి బాగా డబ్బుగల వాడికే పెద్దపెద్ద స్కూళ్ళలో ప్రవేశం. అలాటి వాళ్ళే యెనకేనాప్య పోయిన క్లాసులు తెచ్చుకొంటారు. వారికే ఉద్యోగాలు ఇలా ఈ విషచక్రం తిరుగుతూనే వుంటుంది. ఈ దృష్టితో పాతవిద్యావిధానాన్ని కాల్చి నాశనం చేయాలని ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి ఆగస్టు 15వ తేదీన సికిందరాబాద్ ఘాస్‌మండి అభ్యుదయ ప్రాథమిక పాఠశాలలో పురోగమన గీతాన్ని విడుదల చేస్తూ అన్న మాటల అంతరార్థం చాలా వుంది. పసివారు మోయలేక మోయలేక పుస్తకాల సంచీలతో బస్సు లెక్కుతుండడం, నోట్సు వ్రాయలేక కష్టపడుతుండడం, పిల్లల తలిదండ్రులు, పుస్తకాలు, నోటుబుక్కుల కోసంపడిగాపులు గాయడం చూచి ముఖ్యమంత్రి మనస్సుకు తక్కతలాడి వుంటుంది. అందువల్లనే పాతవిద్యావిధానాన్ని కాల్చి నాశనం చెయ్యాలన్నారు. ఆయన అన్నట్టు చదువుకు మూడున్నర గంటలు చాలు. ఆధునికోపాధ్యాయునికి కనీసం నాలుగుభాషలు, ఐదారు విషయాలు తెలిసి వుండడం అవసరం. వీటితోపాటు చిత్తశుద్ధి, వ్యాపార దృష్టి లేకపోవడం వుండాలి. ఇవి విద్యావిధానం మారితేగాని కుదరదు. ముఖ్యమంత్రి దానిని కాల్చదలచారు గనుక దానిని మసిచేసి మూసీలో కలిపి నూతన విద్యావిధానం అమలుపరచితే, ముందు తరాల వారంతా, క్రమశిక్షణ కలవారు, ఆలోచనాపరులు, లక్ష్యశుద్ధి వున్నవారు కావచ్చు.

### భారతీయులంతా హిందువులే :

కామకోటి పీఠం శంకరాచార్యులు శ్రీ జయేంద్ర సరస్వతి ఆగస్టు 13న పద్మారావునగర్‌లో పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ, అన్యమతాలకు చెందిన ఏ వ్యక్తినైనా, హిందూమతంలోకి చేర్చుకోవచ్చునని హిందూమతంలోకి ఎంతమంది మారదలచుకొన్నా, వారిని చేర్చుకోవడానికి తమ పీఠం సిద్ధంగా వున్నదని స్పష్టం చేశారు. కాని, ఎవరైనా స్వచ్ఛందంగా మతం మార్చుకొంటే తప్పులేదని, నిర్బంధంగాని, ప్రలోభంగాని తగదని అన్నారు. వేదలు చెబుతున్న దానినిబట్టి ప్రపంచంలోని మానవులందరూ జన్మతః హిందువులేనని, కొందరు హిందువులు మతం మార్చుకోవడం వల్లనే అన్యమతస్థులయ్యారని, కనుక వారిని తిరిగి హిందూ మతంలో చేర్చుకోవడంలో తప్పులేదని స్వామి అన్నారు.

### ఉపశ్రుతి :

బస్సులో పైన కమ్మీ పట్టుకొని వ్రేలాడుతున్నాను. రండి, రండి, ఒరేయ్ లేవరా, మాష్టర్ని కూర్చోనీరా అని పిలిచారు వెనుకకూర్చున్న మిత్రులు కథక, నవలా చక్రవర్తి శ్రీ పోరంకి దక్షిణామూర్తి. ఇక్కడేమిటి మర్యాద? అన్నాను. ఎవరైనచో తన మదకరీంద్రమును దిగ్గి కృష్ణరాయలే పెద్దనను ఏనుగు ఎక్కించుకొన్నాట్ట. మరి నేను బస్సులో సీటన్నా ఇవ్వద్దా? అన్నారు ఆయన. అంటే మీరు కృష్ణరాయలా? అని ప్రక్క ప్రయాణికుడడిగాడు. నేను పెద్దన్ననుకాను. ఆయన దక్షిణామూర్తి, [కృష్ణరాయలుకాడు] అన్నాను కాని ఇది బస్సేకాని మదకరీంద్రముకాదుకదా! అని మరొక ప్రయాణికుడు చలోక్తి విసిరారు.

—తిరుమల రామచంద్ర








**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**

## ఇది పరిమళాల సమయం... ఇది పుష్పాలు వికసించే సమయానికి అనుసారంగా

# హెచ్ ఎమ్ టి గడియారాలు

సూర్యకాంతితో భాసించే సమయం. చాలా కాలం జ్ఞాపకం వుంచుకునే కొన్ని సమయాలు. గడ్డిపై మనోహరంగా కనిపించే మంచు బిందువుల తళుకులు. వేల పుష్పాల సుమధుర పరిమళాలు. అంతేకాక మీ హెచ్ ఎమ్ టి మీతోనే. ఎల్లప్పుడూ. అందమైన ఆభరణం లాగా తయారు చేయబడినది. హాయిగా కొట్టుకుంటూ వుండేది. చాలా సంవత్సరాల వరకు.

హెచ్ ఎమ్ టి గడియారాలు

- 17 మరియు 21 జ్యువెల్స్
- పారాషాక్
- యాంటీ-మాగ్నెటిక్



ార్కెటింగ్ డివిజన్




ాష్ట్రమునకు టైమును
ాచించువారు

ుకోరికకై ఎదురు చూస్తూవుంటాం
ాగడియారాల శ్రేణితో ప్రతిక్షణం.